గజేసిన అండవృద్ధి యనబడును. ఈ అండవృద్ధి, వాతజ, పిత్తజ, శ్లేష్మజ, రక్తజ, మేదోజ, మూత్రజ, అంత్రజ (అనగా నరములు తొలగుట) ముల నియేడు విధములుగనుండును.

వృద్ధినాశనగసము — రసము, ౧ పాలు, గంధకము ౧పా, స్వర్ణమాక్షికము ౨పా, వీనిని కరక్కాయలకషాయముతో మూడుదినములాను, ఆముదమున నొకదినమునుమర్దించిసేవించిన, అండవృద్ధినశించును.

పునర్నవాదితైలము — తెల్లగలిజేరు వేరు, పెద్దగుమ్ముడుపట్ట, దేవదారుపట్ట, తిప్పతీగ, యవక్షారము, సర్జక్షారము, వెలిగారక్షారము, ఉప్పు, బిడాలవణము, నల్లఉప్పు, సైంధవలవణము, కాచలవణము, చెంగల్వకోష్టు, తామరగడ్డలు, తుంగగడ్డలు, కచ్చూరములు, సన్నరాష్ట్రము, వస, పిల్లిపీచరవేళ్లు, ఓమము, పెద్దసోపు, ఇంగువ, వాయువిడంగాలు, అతివస, అతిమధురము, శొంఠి, పిప్పలి, మిరియాలు, చెవ్యము, చిత్రమూలము, వీనిని సమాంశములుగగూర్చి చూర్ణముచేసి, దీనికంతటికి సముముగ తానికాయలబెరడు పొడికలిపి ఉదకముపోసి కల్కముగజేసి, పిదప, నువ్వులనూనె ౧ పడిపోసి, వీనికన్నిటికి రెండింతలు ఆవు పంచితము, కలి వీనినిపోసి మైనముగునట్లు ఆతైలమునుకాచి, రెండుపూటల యందును ఒకొక్కపలముచొప్పున పుచ్చుకొనిదానితోనే వస్తికర్మకూడచేసిన యెడ అండవాయువులు నడుమునొప్పులు, వీపుతొడలు వృషణములు వీనియందలి నొప్పులు మానును.

— కానుగు, జిల్లెడాకు, గజ్జెరాకు వీనినినూరి పట్టించికట్టినను, లేక పాపరతీగనునూరి పట్టించినను సప్తవృద్ధులుమానును.

— చిట్టాముదపువేళ్లు, ములుగోరంటవేళ్లు వావిలివేళ్లువీనినికషాయము పెట్టి దీనిలోసైంధవలవణమును ఆముదమును కలుపుకొని సేవించిన సప్తవృద్ధులుమానును.

— గచ్చవేళ్లు, పులవలు, వెల్లుల్లి వీనిని కషాయముపెట్టి అందులో, ఇంగువను నేతిని కలుపుకొని సేవించిన సప్తవృద్ధులుమానును.

— బాగవేళ్లకషాయములో, ఇంగువ, శొంఠి, సైంధవలవణము పిప్పళ్లు, వీనినిసరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి, కలిపిసేవించిన సప్తవృద్ధులు మానును.

—సౌవర్చలవణము, సైంధవలవణము, ఇంగువ, జీలకఱ్ఱ, కార్చిను గచెక్క, నెమలిచెక్క, బోడతరము, సొంటి, పిప్పలి మిరియాలు, వీనిని చూర్ణముచేసి కర్ష మెత్తుచొప్పున వేడినీళ్లతో నిచ్చిన పనుసు వృషణముల వలెనగును.

ఆంత్రజవృద్ధియందు గలిజేరాకునుడికించి ఆరునెలలు కట్టవలయు, లేకరక్షనైన వేయవలయు. మూత్రవృద్ధియందు దానిని శస్త్రముచేసికార్చి ఆసనవృషణములకునడుమ రక్షవేసిన, బుడ్డనివర్తించును.

కట్టెలనునఱుకుట, దారినడచుట, వాతకరపదార్థములను భుజించుట, స్త్రీలగూడుట, అశ్వాదులనెక్కి తిరుగుట ఈపనులను అండవృద్ధిగలవారు వర్జింపవలయు.

## వర్ధ్మరోగలక్షణము.

పులుసు- జిగటగల పదార్థముల విశేషముగ భక్షించుట వలనను, బరువును మోయుట, చన్నీళ్ళనానుట, ఆయుధములద్రిప్పుట, గట్టిగఅరచుట- దూరమునడుచుట మోహమువలన విషమబంధములచే స్త్రీలగూడుట- ఇట్టికృత్యములవలన వాతము ప్రకోపించి సన్ననిప్రేగులు, నరములు, వీనియందు ప్రవేశించి నాడులను స్వస్థానములనుండి తొలగదీసి గజ్జలయందు గ్రంథిరూపశోభనుగలుగంజేసిన వర్ధ్మరోగమనబడును. దీనియందుజ్వరము కృశత్వము, శూల, ఈలక్షణములుగలుగును.

చికిత్స—సైంధవలవణమును ఆవునేతిలోకలిపి ౧ తులమువంతున పదుదినములు పుచ్చుకొనుచు ఆగ్రంథులమీద లేపనముగూడజేసిన అవినివర్తించు. కానుగ వేరునుగాని గంటుభారంగినిగాని కుడితితోనూరిలేపనము చేసిన నివర్తించును.

—పెద్దపాపరవేళ్ళనునువ్వులనూనెతోమర్దించి ఆవుపాలలోకలిపిపుచ్చుకొనినననివర్తించును.

సైంధవలవణము అన్నభేది వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి కొంచెము ఆముదము కలిపిపుచ్చుకొనుచు వృషణములకు వస్త్రములనుబంధించుచుండినననివర్తించును.

## రేతోదోషలక్షణము.

కారము- పులుసు- ఉప్పు ఉష్ణపదార్థములువీనినివిశేషముగభక్షించుటవలనను- అతిమైధునమువలనను- యోనిదోషములవలనను- ద్వేషయుక్త స్త్రీసంభోగమువలనను -మనస్సంతాపమువలనను-వీర్యమునునిరోధించుటవలనను శుక్రదోషముగలుగును-

చికిత్స—మినపప్పును నేతితో వేయించి, ఆవుపాలలోవేసి శర్కరగలిపి పాయసమొనర్చిపుచ్చుకొనిన దోషముతొలగి వీర్యవృద్ధిగలుగును.

—తెల్లగురిగింజలను చల్లపిల్లిగడ్డలనుచూర్ణముచేసి ఆవుపాలలో వేసిపుచ్చుకొనిన వీర్యవృద్ధి గలుగును.

—నేలగుమ్మడుగడ్డలను కల్కముదీసి నెయ్యిపాలుకలిపితేహపాకమునవండి అత్తిపండంతప్రమాణమున పుచ్చుకొనిన వృద్ధునికి సహితము వీర్యవృద్ధికలుగును.

—మేకపోతువృషణములనుమర్దించిపాలలోవేసి యుడకబెట్టినువ్వులపిండికలిపి భక్షించుచుండిన-ఎంతమందిస్త్రీలతోనైననురమింపవచ్చును.

—పెద్దపల్లెరుకాయలు చల్లపిల్లిగడ్డలు, దురదగొండివిత్తులు, నీరుగొబ్బివిత్తులు, చిట్టాముట్టివేళ్లు, పేరాముట్టివేళ్లు,వీనినిసమాంశముగగూర్చి చూర్ణముచేసి ఆవుపాలలోగలిపి రాత్రులయందు బుచ్చుకొనిన, ఎందఱుస్త్రీలతోనైనరమింపవచ్చును.

—ఉసిరికవరుగును చూర్ణముచేసి, ఆయుసిరికరసముచేత నేయూరబెట్టి, శర్కర తేనెనెయ్యికలిపి పుచ్చుకొనిపాలుత్రాగుచుండిన వీర్యవృద్ధి గల్గుగును.

—నేలగుమ్మడుగడ్డనుచూర్ణముచేసిదానిరసముచేతనే ఊరబెట్టి,ఆవుపాలు,నేయికలిపిత్రాగిననూరుమందిస్త్రీలతోగూడదగిన శక్తిగలుగును.

—తింపలములచల్లపిల్లిగడ్డలను పొట్టుతీసిదంచి, ఆవునెయ్యితింప, ఆవుపాలు తింప, వీనిని ఒకకుండలోనునిచి- మెల్లనిమంటచేత, పాలిగురువరకుకాచి, వడియగట్టి శర్కర,పిప్పళిపొడి, తేనెవీనినిసమానముగజేర్చి ప్రతిదినముపుచ్చుకొనిన వీర్యవృద్ధికలుగును.

అశ్వగంధతైలము—పెన్నేరుగడ్డ, జటామాంసి, చెంగల్వకోష్టు, పెదములకపండు, చల పిలి గడలు వీనిని సగిపాలుగగూర్చి దంచి [illegible]

డలోనునిచి దీనికినాలుగుపాళ్లు ఆవుపాలుపోసి, అన్నిటికిసమముగనువ్వుల నూనెబోసి, మెల్లనిమంటచేవండిదించి, లింగమునకు స్తనములకులేపనము చేసిన నవిమిక్కిలికఠినంబులగును.

—పెన్నేరుగడ్డనునల్లయుమ్మెత్తాకురసమునబాగుగమర్దించి, బర్రె వెన్నకలిపి, నల్లయుమ్మెత్త కాయలోబెట్టి, ఆవుపేడపొదిగి కొద్దిపుటము వేసి, చల్లారినతరువాతదీసి, నల్లయుమ్మెత్తకాయలరసముచే ఖల్వముక్షణ దీకించి లింగమునకు లేపనముచేసిన హయలింగముంబోలి దృఢమై సుర తమునందు మిక్కిలి శక్తిగలిగియుండును.

—శుద్ధిగలజీడిగింజలు, దానిమ్మపండ్లు, వాక్కుడుపండ్లు, వీనిరస ములను క్షీరముచేసి వుచ్చుకొని ఆవనూనెను లింగమునకులేపనముచేసిన హయలింగమువలె దృఢముగనుండును.

—దుష్టపువేరు, చాగశేరు వీనిని ౭ దినములు మేకమూత్రమునం దు నానబెట్టి నూరి లింగమునకు లేపనముచేసి వీర్యము స్తంభించును.

—తెల్లతామరపువ్వులోనికింజలక్షములు, నల్లకలువ గడ్డలు వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి కొంచెము చక్కెర తేనెకలిపి మ ర్దించి, లింగమునకుబూసికొని సంగమంబొనర్చినమిక్కిలిసుఖముకలిగి లిం గముదృఢముగనుండును.

నారసింహచూర్ణము—చల్లపిల్లిగడ్డలపొడి, పెద్దపల్లేరు కాయల పొడి ఇవిరెండును ౧ ప్రస్థము, నేలతాటిగడ్డలపొడి ౪ వీసె, తిప్పసత్తు ౪౽ వీ, శుద్ధిగలజీడిగింజలు ౪౺ వీ,చిత్రమూలచూర్ణము ౹ వీ, తెల్లనువ్వు లపిండి ౧ ప్రస్థము, సొంటి, పిప్పలి, మిరియాలు ఇవి రూపల,శరక్కర ౧౺ వీసె, తేనె ౪౽వీ, ఆవునెయ్యి ౪ వీసె. నేలగుమ్మడుగడ్డచూర్ణము ౧ప్ర స్థము, వీనినన్నిటినేకముచేసి ఒకకుండలోబోసియుంచి, ప్రాతకు ౪ పల ముచొప్పున శాకటూసము వుచ్చుకొనిన, ముదిమి, మేహములు, పాండువు పన్నిపాతములు మొదలగు రోగములునూనును, శరీరమునకు మంచికాంతి గలుగును. సింహపరాక్రమంబును, అశ్వవేగంబును, గరుడదృష్టియు, నూ ర్గుస్త్రీలగూడదగినశక్తియు, మంచిసంతానమును గలుగును,

గోధుమరసాయనము—౺౪ షడిగోధుమలనుఒకకుండలోబోసి దా నిలోనాకటూము నీళ్లుబోసికషాయముపెట్టి, నాలవపాలు మిగులునట్లు

కాచి, దానిలో గోధుమనూక, మినపప్పు, తెల్లగురిగింజలు, ద్రాక్ష, ఖర్జూరము, చిట్టీతపండ్లు, తిప్పసత్తు, అతిమధురము, శొంఠి, పిప్పలి, మిరియాలు, పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, శుద్ధిగలజీడిగింజలు దూలగొండివిత్తులు, వీనిని సమాంశములుగ గూర్చి చూర్ణము చేసికలిపి, ఆవునెయ్యి ౧ వీసె, కషాయమునకు నాలుగింతలు ఆవుపాలు వీనిని పోసి చెలుకుదంటుతో కలియబెట్టి మెల్లనిమంట చే వండి, ఏలకులు, లవంగపట్ట, పచ్చకర్పూరము, పిప్పళ్లు, మిరియాలు, నాగకేసరములు వీనిని సరిపాళ్లుగ గూర్చి చూర్ణము చేసి వస్త్రగాలితము చేసి దానిలో వేసి కలియబెట్టి లేహపాకమున దించుకొని ప్రతిదినము పలమువంతున బుచ్చుకొనిన, సురతసమయంబున లింగమునకు శైథిల్యము శుక్రనష్టము గలుగక బలము వీర్యవృద్ధి కలుగును. ౧ పలములవంతున ౧౫ దినములు తప్పక బుచ్చుకొనినయెడ నూర్గురు స్త్రీలతో రమింపదగిన శక్తిగలుగును, మఱియు వాతములు, మూత్రకృచ్ఛ్రములు నుమానును.

గుడకూశ్మాండలేహము — నువ్వులనూనె ౧ వీసె, ఆవునెయ్యి ౧ వీసె వీనిని బాగుగ కాగబెట్టి, వానిలో బెరడుతీసిన బూడిదగుమ్మడుపండు బద్దలను ౧౦౦ పలములు వేసి పక్వముచేసి, లవంగపట్ట, ఆకుపత్రి, శొంఠి, పిప్పలి, మిరియాలు, దనియాలు, జీలకఱ్ఱ, చిన్నయేలకులు, పెద్దయేలకులు, మోడి, చెవ్యము, చిత్రమూలము, దురదగొండివిత్తులు, పరికెగడ్డలు, తుంగముస్తెలు, నేలతాటిగడ్డలు, చిట్టాముట్టి, వీనిని ప్రత్యేకము ౧ తులముచొప్పున గూర్చి చూర్ణముచేసి వేసి, ౨౪ వీసె ప్రాతబెల్లమును కలిపి లేహపాకమున వండి దించి చల్లారినతరువాత ౧ సేరు తేనె కలిపి పుచ్చుకొనిన, సన్నిపాతములు, మందాగ్ని, కాసశ్వాసలు, జ్వరములు, వాంతులు, వెకిళ్లు మానును కృశించినవారికి పుష్టికలుగును మిక్కిలి స్త్రీవ్యాపారము వలన క్షీణించిన రేతస్సుగలవారికి వీర్యవృద్ధినిచ్చును.

నవాయసాదిచూర్ణము — కరక తాడియుసిరికలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తుంగముస్తెలు, వాయువిళంగాలు, వీనిని సమాంశములుగ గూర్చి దీనికి తొమ్మిదవపాలు లోహభస్మమును జేర్చి, తేనె, నెయ్యి, వీనితోగాని, ఆవుమజ్జిగతోగాని, ఆవుపంచితముతోగాని పుచ్చుకొనిన పాండురోగములు, శోషములు, భగందరము, మూలవ్యాధులు, ఉదరములు మాని ధాతువృద్ధి కలుగును.

మాషాదిమోదకములు—మినపప్పు, పొట్టుదీసినగోధుమలు, పొట్టుదీసినయవలు, బియ్యము, పిప్పళ్లు, వీనిని ప్రత్యేకము ౧ పలము చొప్పున గూర్చి చూర్ణముచేసి దీనికంతటికి సగపాలు ఆవునెయ్యిపోసి వేయించి దానికిసరిపాలు పంచదారగలిపి అరపడి నీళ్లుపోసి మెల్లనిమంటచే వండి బాగుగగలియబెట్టి, యుండలుచేసి సాయంకాలమునందు బుచ్చుకొనుచు అర్ధసేరుపాలను త్రాగి, పులుసుకారములవర్జించిన, మిక్కిలివీర్యవృద్ధిగలుగును.

మదనకామదేవరసము— రజతభస్మము ౧ పాలు, వజ్రభస్మము ౨పా, స్వర్ణభస్మము ౩పా, తామ్రభస్మము ౮పా, పాదరసము ౫ పా, గంధకము ౬ పా, లోహభస్మము ౯పా, వీనిని ఖల్వమునకలుబందరసముతో బాగుగమర్దించి, గాజుకుప్పెలోబెట్టి, దానిమూతికి చీలమన్నుచే మెండించి, ఒకకుండలోదానిగొంతువరకు సైంధవలవణమునుపోసి దానిమీదకుప్పెనునిచి, కుండపైన మఱియొకకుండను బోర్లించి, చీలమన్నుపూసిపొయ్యిమీదబెట్టి మెల్లనిమంటచే ౮ జాములువండి, చల్లారినపిదప, ఔషధమునుతీసి, జిల్లేడుపాలు పెన్నేరుగడ్డ, దురదగొండివిత్తులు, నేలతాటిగడ్డలు, పెద్దపల్లేరు, చల్లపిల్లిగడ్డలు తుంగముస్తెలు, తామరదుంపలు, వెల్లివీనిరసముతో ప్రత్యేకముగ మున్నూరుమర్దించి యూరబెట్టి, ఈయౌషధమున కెనిమిదవపాలు, కస్తూరి, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, పచ్చకర్పూరము, ఏలకులు, లవంగములు, వీనినిచూర్ణముచేసి కలిపి ఒక్కొకకర్షము చొప్పునఔషధమునుతీసికొని అంతమాత్రము శర్కరనుగలిపి రెండుపలముల ఆవుపాలనుకలిపి పుచ్చుకొనిన, కాంతి, బలముకలిగి, యనేకస్త్రీలతో రమింపదగిన వీర్యపుష్టికలుగును. దీనికి పులుసు పదార్థముల వర్జించవలయు, మధురాహారంబుల భక్షించవలయు.

శృంగారాభ్రకరసయోగము—శుద్ధిగలపాదరసము ౨ పా, అష్టశుద్ధులుగలగంధకము ౧ పా, తామ్రభస్మము ౩ పా, నాగభస్మము ౧౪ పాలు, వంగభస్మము ౧౪పా, లోహభస్మము ౪పా మండూరము ౪పా, స్వర్ణభస్మము ౪పా, హేమమాక్షికము, చెంగల్వకోష్టు, లక్కజటామాంసి, తాళీశపత్రి పచ్చకర్పూరము, జాజికాయ, కస్తూరి, ఇంగిలీకము, మంజిష్టి, దేవదారుచెక్క, లవంగాలు, మణిశిల ఇవియొక్కొకపాలు, అభ్రకభస్మము ౬౪పా, బోరిఢీమము ౩। పా, నల్లకలువదుంపలపొడి [illegible] పా,

వీనిని జేర్చి, తమలపాకుల రసముతో నవనీతముగునట్లు మర్దించి, సెనగగింజంతమాత్రలుచేసి నీడనెండించి, పూటకు ౧ మాత్రచొప్పున, లవంగాల అనుపానముతో బుచ్చుకొనిన, అగ్నిమాంద్యము- అజీర్ణము- శూలలు- మేహములు, ఉదావర్తము- మూత్రకృచ్ఛ్రాదులు ఇవి యన్నియు మానును- దేహమునకు కాంతి- దీర్ఘాయుష్యము, గలుగును వీర్యమును వృద్ధిచేయును స్త్రీసంభోగముచేసిన పిదప ఈయౌషధమును భక్షించినవారలకెప్పటికిని బలముతగ్గకయుండును. పాలుఅన్నము- నెయ్యి మినుముపదార్థములు మధురపదార్థములు వీనినిపథ్యముగ జేర్చుకొనవలయు.

మహాభల్లాతకీలేహము—మానెడుసల్లజీడిగింజలను ఇటికపొడిచే రుద్ది ముక్కలనుతీసివేసి నీళ్లచేగడిగి గాలినఆర్చి- ఒక్కొక్కదానిని రెండు గాకోసి- నాలుగుమానికలనీళ్లలోవేసి నాలుగోవంతు మిగులునట్లుకాచిచల్లారనిచ్చి- మానెడునెయ్యి, ౪పడి శర్కర వీనినివేసికలిపి- కాచి కృష్ణాగరు- కరక్కాయ- సొంటి- పిప్పళ్లు- మిరియాలు- వాయువిళంగాలు వీనిని సమభాగములుగ్రహించి- చూర్ణముచేసి ౧ ఆళాకుకలిపి- ౨ఆళాకులు ఉసిరికపప్పుపొడి, ౨ఆళాకులుతేనె వీనినికలిపికాచి- ఏడుదినములుధాన్యపుటముననగాని-భూమియందుగానియునిచి-దానికాయంతచొప్పున బుచ్చుకొనినస్త్రీసంబంధరోగములన్నియు మాని వీర్యవృద్ధికలుగును.

---

## శ్వాసలక్షణము.

శ్వాసరోగము అయిదు భేదములు గలిగియుండును. అందు మహాశ్వాసమునందు గొప్పమోతగలిగియుండును.ఊర్ధ్వశ్వాసమునందుఊర్ధ్వదృష్టిగలిగియుండును. ఛిన్నశ్వాసమునందుశ్వాసమునిలిచినిలిచిపుట్టును-తమశ్వాసమునందు కన్నులుగానరాకభ్రమసినట్లుండును-క్షుద్రశ్వాసమునందు అల్పవేదనగలిగియుండును. క్షుద్రశ్వాసము- సాధ్యము. తమశ్వాసము యాప్యము- తక్కినమూడును అసాధ్యములు.

చికిత్స—మిరియాలు-మణిశిల- లక్క- పిప్పళ్లు- వీనినిచూర్ణముచేసి దీనికిసరిబెల్లముకుకలిపి మూనెతో కర్ష మెత్తుచొప్పున బుచ్చుకొనిన క్షుద్రశ్వాసముమానును.

—వట్టివేళ్లు- దిరిసెనపుచెక్క- పిప్పళ్లు- బెల్లము వీనిని సమభాగములుగగలిపి- తరిగడుగులోనిచ్చిన శ్వాసములుమానును.

—సరళదేవదారు- పసపు- రాస్న- కరక్కాయలు - ఉసిరికపప్పు- తాడికాయలు- సొంటి- పిప్పలి- మిరియాలు- పద్మపువేళ్లు- వాయువిళంగాలు- వీనినిసమభాగములుగ చూర్ణముచేసి- సరిభాగముపంచదారనుగలిపియిచ్చిన శ్వాసకాసములుమానును.

—దూలగొండివేళ్లు- పిప్పళ్లు- ద్రాక్షపండు- కర్కాటకశృంగి-కరక్కాయలు వీనినిసమాంశములుగచూర్ణముచేసికర్షమెత్తుచొప్పునతేనెతోబుచ్చుకొనిన- శ్వాసము- కాసము-ఊర్ధ్వవాతము ఇవిమానును.

—కచ్చూరములు- సైంధవలవణము- సొంటి- పిప్పళ్లు-మిరియాలు వాయువిళంగాలు- చెంగల్వకోష్టు, ఇంగువవీనిని సమాంశములుగ గూర్చి సరిపాలు శర్కరకలుపుకొని కర్షమెత్తు వేడినీళ్లతోబుచ్చుకొనిన శ్వాసము- కాసము- వెక్కిళ్లుమానును.

—ఉత్తరేణినడిమికాడలుకాల్చినమసి- తేనె - నెయ్యి వీనినికలిపియిచ్చిన శ్వాసకాసములుమానును.

శ్వాసకాశేశ్వరరసము—రసము - గంధకము - సువర్ణమాక్షికము- ఇంగిలీకము- నాభి- వంగభస్మము- లోహభస్మము- తామ్రభస్మము- అభ్రకభస్మము జాజికాయ - లవంగపుచెక్క - లవంగాలు - ఏలకులు- నాగకేసరాలు- ఉమ్మెత్తవిత్తులు- నేపాళములు- కచ్చూరములు- పసపు- ఇవిసరిపాళ్లు, మిరియాలు మూడుపాళ్లు వీనినికల్వమున ఇనుపదండముతో మర్దించి- కొడిసెరసముచే ౨౦ ఒక్కసారియూరబెట్టి- రెండుగురిగింజలమెత్తుగాని ఒకగురిగింజమెత్తుగాని అల్లపురసముతో పుచ్చుకొనినఅయిదువిధములైనశ్వాసములు కాసములు మానును.

---

## కాసరోగలక్షణము.

కాసరోగంబులైదు విధంబులు - వాతకాసంబున పొడి దగ్గుగలుగును. పైత్యకాసమున తాపముగలిగియుండును. శ్లేష్మకాసమున చీముసగలిగియుండును.అభిఘాతకాసమువలన రొమ్మునందలిరక్తముచెడిదగ్గుపుట్టు

ను. క్షయకాసము క్షయరోగముతో గూడియుండును. వీనిలో అభిఘాతకాసముయాప్యము- క్షయకాసము అసాధ్యము.

చికిత్స—కసివెంద-తిప్పతీగె- వాకుడు-అడ్డసరము-గుంటగలగర- ఈ అయిదును సమభాగములుగగూర్చి- త్రొక్కి-తీసినరసము ౮ భాగములు- నేయి ౧భా- వీనినికలియబోసి- కాచినఘృతమును పుచ్చుకొనిన పంచకాసములుమానును.

—భారంగి- వాకుడువీనిని కషాయముగాచి తేనె అనుపానముతో బుచ్చుకొనిన పంచశ్వాసకాసములుమానును.

శ్వాసచికిత్సలు కాసమునకును- కాసచికిత్సలు శ్వాసమునకును ఉపయోగించును.

క్షుద్రాదిలేహ్యము—వాకుడువేళ్లు ౧౦౦పలములు. కరక్కాయలు ౧౦౦ప- వీనినినలుతుమునీళ్లలోబోసి తూమెడుగకాచి- వడియబోసిఆకషాయములో ప్రాతబెల్లమును ౧౦౦ పలములుగలిపి - లేహ్యపాకముగకాచి- చల్లారినవెనుక అందులో- సొంటి ౧ప - పిప్పలి ౧ప- మిరియాలు ౧ప- లవంగపట్ట ౧ప- ఆకుపత్రి ౧ప-ఏలకులు ౧ప- నాగకేసరాలు ౧ప- వీనిని చూర్ణముచేసి కలిపి తేనె ౬ ప- కలపవలయు. ఈలేహమును సేవించిన- కఫవికారములు- శ్వాసకాసములు- పంచగుల్మములు - వెక్కిళ్లు- హృద్రోగము- అరుచి- మందాగ్ని ఇవి అన్నియు మానును.

భార్గ్యాదిలేహ్యము—మారేడువేళ్లు- గుమ్ముడువేళ్లు- తక్కిలివేళ్లు- దుందిలపువేళ్లు- కోలపొన్నవేళ్లు- ముయ్యాకుపొన్నవేళ్లు- ములకవేళ్లు- వాకుడువేళ్లు-పల్లేరువేళ్లు-ఇవిఅన్నియుచేరి ౧౦౦ పలములు. భారంగి ౧౦౦ప- కరక్కాయలు ౧౦౦- వీనిని ఎనిమిదితూముల నీళ్లలోవేసినాలుగవభాగముమిగులునటుల కషాయముగాచి - వడియగట్టి- దానిలో౧౦౦పలముల బెల్లమును కలిపి - లేహ్యపాకముగాకాచి - దానిలో సొంటి ౧ప- మిరియాలు ౧ప- పిప్పళ్లు- ౧ప- ఏలకులు ౧ప- లవంగపుచెక్క ౧ ప- ఆకుపత్రి ౧ ప- నాగకేసరాలు ౧ప- వీనిని చూర్ణముచేసి కలిపిచల్లారినపిదప- తేనెను ౮ పలములు కలపవలయు. ఈలేహమును సేవించిన శ్వాసకాసములు- క్షయరోగములు- వెక్కిళ్లు-శ్లేష్మము-ఛర్ది- హృద్రోగము- అరుచి- మేహము ఇవిమానును.

స్వర్ణభూపతి—రసము ౧ పాలు, గంధకము ౧ పాలు, తామ్రభస్మము ౨ పాళ్లు, అభ్రక, లోహ, కాంత, స్వర్ణ,రజతభస్మములు,నాభి, ఇవిప్రత్యేకము ఒక్కొక్క భాగము వీనినన్నిటిని హంసపాది ఆకురసమున ఒకదినముమర్దించి ముద్దచేసి యెండబెట్టి, గాజుకుప్పెలో బెట్టిచీలమన్నుయిచ్చి యెండినతరువాతవాలుకాయంత్రములో బెట్టి,మెల్లనిమంటతోవండి చల్లారినతరువాతతీసి నాలుగుగురిగింజలయెత్తు చొప్పున, పిప్పళ్లు అల్లపురసము వీనితోపుచ్చుకొనిన, సన్నిపాతములు, సర్వవాతరోగములు శూలలు, మేహములు, గ్రహణులు, శ్వాసకాసములు, కామిల, పాండు రోగము, శిరోరోగము మూత్రకృచ్ఛ్రములు, ఇవిమానును.

తాళీశచూర్ణము— తాళీశపత్రము ౧ తు, మిరియాలు ౨ తు, సొంటి ౩ తు, పిప్పళ్లు ౪ తు, తవాక్షీరి ౫ తు, ఏలకులు ౪ తు, దాలచిని చెక్క ౪తు, వీనినిచూర్ణముచేసి, ౩౨ తులముల శర్కరగలిపి పుచ్చుకొనిన, కాస, శ్వాస, జ్వర, ఛర్ది, శూల, పాండురోగములు మానును.

## హిక్కాలక్షణము.

ఎక్కిళ్లువేగముగలిగి జంటగవచ్చినయెడయమళ హిక్కయనియు, గొప్పధ్వనితోగూడివచ్చిన మహాహిక్కయనియు, నాభినుండివెడలి గంభీర శబ్దముతోగూడినది గంభీరహిక్కయనియు,మందవేగముగలిగి వెంటవెంట వచ్చుచుండిన క్షుద్రహిక్కయనియు,అన్నపానాదులవలన బుట్టినది అన్నజహిక్కయనియు, హిక్కలు ౫ విధంబులు, వానిలో మొదటిమూడును అసాధ్యంబులుమిగిలినవి సాధ్యంబులు.

చికిత్స—శ్వాసకాసచికిత్సలు వెక్కిళ్లకును ఉపయోగించును.

—నేతిలో యవక్షారమునుగలుపుకొని సేవించిన వెక్కిళ్లుమానును.

—సొంటి బెల్లమునుగాని, పిప్పళ్లు శర్కరనుగాని, వేడినీళ్లలోగలుపుకొని సేవించిన హిక్కలుమానును.

—దశమూలములను కందులనుకలిపి కషాయముబెట్టిగాని, లేకసరళదేవదారు కషాయమునుగాని ఇచ్చిన వెక్కిళ్లుమానును.

—వెలగపండుగుజ్జు, వరిపేలపిండి, తేనెవీనినిగలిపిసేవించిన వెక్కిళ్లు, ఛర్ది, అరోచకము మానును.

—రేగుగింజలపప్పు, రసాంజనము, లాజలువీనిని చూర్ణము చేసి తేనెతో బుచ్చుకొనినను, లేక పిప్పళ్లు, ఖర్జూరపుగింజలు, ద్రాక్షపండు వీనినినూరి తేనెతోబుచ్చుకొనినను హిక్కలుమానును.

## ఛర్ది లక్షణము.

వాతపిత్తశ్లేష్మములవలనను, సన్నిపాతమువలనను,భీతిజనకపదార్థావలోకనమువలనను అయిదు విధములగు ఛర్దిరోగములు గలుగును. ఇవిగాక, ఇతరములగు అజీర్ణఛర్దులయందు లంఘనముచేయించవలయు.

చికిత్స—అడ్డసరపుపువ్వులరసములోగాని,తిప్పతీగరసములోగాని, పిప్పళ్లు, లాజలు, వెలగపండు, రేగుగింజలలోనిపప్పు, ఏలకులు,లవంగాలు, ఆకుపత్రి, వీనినిచూర్ణముచేసి, వరాయెత్తుచూర్ణమును తేనెలో గలిపి సేవించిన సకలఛర్దులుమానును,

—మారేడువేళ్లు, కొత్తిమిరివిత్తులు, సొంటి, లాజలు, పెసలువీనినికషాయముపెట్టి,శర్కరగలిపిసేవించిన సకలమైనవాంతులుమానును.

—నెమలియీకలమసి, చెంగల్వకోష్టుమసి, గవ్వలమసి, తేనెవీనినిగలిపినాకించిన, వాంతులుమానును.

బిల్వాదిలేహము—౩౦పలములమారేడువేళ్లను తఅమెడు నీళ్లలోవేసికషాయముపెట్టి, ౮ వభాగము మిగులునట్లుకాచి, ౩౦పలములబెల్లమును సాంద్రపాకముగాకాచి, దించి అందులోసొంటి ౩ప, మిరియాలు ౪ప, పిప్పళ్లు ౧ప, చెవ్యము ౧ప, తాళీశపత్రి ౧ప, నాగకేసరాలు ౧ ప, మోడి ౨ప, చిత్రమూలము ౧ప, ఏలకులు ౧ కర్షము, లవంగాలు ౧క, ఆకుపత్రి ౧క, జీలకర్ర ౨ప, వీనినిచూర్ణముచేసి కలిపి తేనెపోసి అనువుగాకలిపి సేవించిన సకలఛర్దులుమానును. హృద్రోగము, కామిల, గుల్మము,గ్రహణి,అరుచి,పీనస,వెక్కిళ్లు,కాసము,శ్వాసము, క్రిములు,కడుపుబ్బరము,గళరోగము,పాండువు,మూలవ్యాధి,ఇవియన్నియు మానును.

## తృష్ణారోగ లక్షణము.

నాలుకవెలికివచ్చుట, బిరుసుగనుండుట, కాంతిచెడుట, మాటలుడుగుట, ముఖమువాడుట,జలాభిలాషగలుగుట, పంచేంద్రియములు సత్వము మనస్సుచెడుట,దగ్గుత్తికపడుట ఈలక్షణములుతృష్ణారోగమునందుగలుగును

చికిత్స—టెంకాయనీళ్ళలోలాజపొడికలిపిత్రాగిన తృష్ణమానును.

—నాగకేసరములు, నేలగుమ్మడిగడ్డ, పిప్పళ్లు, జీలకర్ర, దాడిమకాయ, తేనె వీనినికలిపిసూరి శర్కరనుజేర్చి సేవించినతృష్ణమానును.

—మఱ్ఱిచిగుళ్లు, పల్లేరువేళ్లు, లాజలు, తెల్లకలువగడ్డలు,వీనినినూరి తేనెకలిపి యుంటలుచేసి నోటనునిచికొనిన తీవ్రతృష్ణమానును.

—ద్రాక్షపండు, యష్టిమధుకము, తెల్లకలువగడ్డ వీనినిసరిపాళ్లగగూర్చినూరి, చెఱకురసము, తేనెవీనిలోగలిపి నోటనునిచి కొనిన తృష్ణమానును. పాలువంటకముపథ్యము.

—ద్రాక్షపండు-చెఱకురసము, వీనినిపాలలోగలుపుకొని పుక్కిటబెట్టుకొనిన నోరెండుటమానును. లేక, బెల్లపుపానకములోచింతపండు సైంధవలవణము- తేనెవీనినికలిపి గండూషముచేసినను సెలవులు ఎండుట మానును- నోరు నాలుక-బాగుగనుండును.

---

## హృద్రోగలక్షణము.

విరుద్ధాహారవిహారములవలన వాతాదిదోషములుప్రకోపించిఅయిదువిధములగు హృద్రోగముల గలుగజేయును. వాతమువలన ఱొమ్మునొప్పిగలిగియుండును. పైత్యమున ఱొమ్మునందు తాపము గలిగియుండును- శ్లేష్మమున ఱొమ్ము బరువై స్తంభించియుండును. త్రిదోషమున-పైలక్షణములన్నిగలుగును. క్రిమిహృద్రోగమున మిక్కిలిఁపోటగలుగును, దోషహృద్రోగము అసాధ్యము.

చికిత్స—నిమ్మపండ్లపులుసు సైంధవలవణము నూనెవీనినికలిపిత్రాగినవాతహృద్రోగమమానును.

—సొంటి- సౌవర్చలవణము- ఇంగువ- దానిమ్మకాయ - పుల్లప్రబ్బలి వీనినిసమభాగములుగగూర్చి చూర్ణముచేసి కషాయమెత్తుచొప్పునపుచ్చుకొనిన వాతహృద్రోగముమానును.

—చెఱకురసము నాలుగుకుంచములు- నెయ్యికుంచెడు-కోలపొన్నమయ్యాకు పొన్నలకల్కము నేతికి ౮ వపాలు - ఇట్లువీనినిజేర్చికాచి ఆఘృతమును పుచ్చుకొనిన పైత్యహృద్రోగముమానును.

—పిప్పళ్లు- కచ్చూరాలు- అతివస-రాస్న-కరక్కాయలు-పుష్కర

మూలము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి కషాయమెత్తు చొప్పునగో మూత్రముతో బుచ్చుకొనిన శ్లేష్మహృద్రోగముమానును.

—చెంగల్వకోష్టు- వాయువిళంగాలు వీనిచూర్ణమును కర్ష మెత్తు గోమూత్రముతోసేవించిన క్రిమిహృద్రోగముమానును.

—నీళ్లనాలుగుకుంచములు- నెయ్యికుంచెడు, సేతికినాలవపాలుకరక్కాయలు- సౌవర్చలవణము వీనిని కల్కముచేసి పైఘృతాదులలోవోసి కాచియాఘృతమును సేవించిన సకలహృద్రోగములుమానును.

రసాయనము— రసభస్మము- గంధకభస్మము- అభ్రకభస్మము వీనినిసరిపాళ్లుగగూర్చి యెండలోనునిచి- మద్దిచెక్కరసమున నిరువదియొకమారు ఊరబెట్టి- మినపగింజలంతచొప్పున తేనెతో బుచ్చుకొనిన, సకల హృద్రోగములుమానును.

—ఇంగువ ౧ పాళ్లు, వస ౨ పా, చెంగల్వకోష్టు ౬ పా, సౌవర్చలవణము ౪ పా, వాయువిళంగాలు ౧౦ పా, వీనిని చేర్చి చూర్ణముచేసి వేడినీళ్ళతోబుచ్చుకొనిన హృద్రోగములు గుల్మములు, శూలలు, వాయువులు మానును.

---

శూలలక్షణము.

వాతశూలయందు కడుపునొచ్చును పైత్యమునందుబొడ్డునొచ్చును. శ్లేష్మమునందు గుండె నొచ్చును - త్రిదోష శూల అన్నిలక్షణములు గలిగియుండును.

చికిత్స—తమలపాకురసములో ఆముదమునుగలుపుకొని సేవించిన అసాధ్య శూలరోగులైనను బ్రతుకుదురు.

—వేడికలినితాగించినను యిసుకపొట్లమునకాచినను తీవ్రశూలలుమానును.

హింగ్వష్టకచూర్ణము — సొంటి, పిప్పలి-మిరియాలు - ఓమము - జీలకర్ర- నల్లజీలకర్ర, సైంధవలవణము- ఇంగువ- వీనిని సమభాగములుగ చూర్ణముచేసి- కషాయమెత్తుచొప్పున వేడినీళ్లతో ఇచ్చిన హృదయశూల- ఉదరశూల- గుల్మము- మూలవ్యాధి- గ్రహణిఇవిమానును.

—కొత్తిమెర్లు- వృషభరసమూలము-కరక్కాయలు- పుల్లబ్బలి,బి

డాలవణము-వస- ఇంగువ- సైంధవలవణము వీనినిసమభాగములుగచూర్ణముచేసి కర్ష మెత్తుచొప్పున తరికడుగుతోబుచ్చుకొనిన శూలలు మానును.

అన్నభేదిమాత్రలు—అన్నభేది, జీలకఱ్ఱ, ఓమము, కరక తాడి ఉసిరికలు,పిప్పళ్లు,మిరియాలు, సొంటి, ఇవిసమభాగములు,సైంధవలవణము ౨ పాళ్లు వీనినికలిపి నిమ్మపండ్లరసముతో మర్దించికందిగింజలంతమాత్రలు చేసి రెండుపూటల నొక్కొకమాత్ర చొప్పునపుచ్చుకొనినశూలలుమానును.

శూలకుఠారరసము—రసము, గంధకము, కరక తాడి ఉసిరికలు సొంటి, పిప్పలి, మిరియాలు, శుద్ధతాళకము, నాభి, తామ్రభస్మము నే పాళములు వెలిగారము వీనిని సరిపాళ్లుగగూర్చి గుంటగలగరాకురసము చేజక్కగమర్దించి, రెండుగురిగింజలంత మాత్రలుచేసి, ఒక్కొకటిచొప్పున మిరియాలపొడితోగాని, అల్లపురసముతోగాని పుచ్చుకొనిన సకల శూలలుమానును.

శూలారిరసము—రసము, గంధకము, తామ్రభస్మము, సొంటి, మిరియాలు, ఇంగువ,వస, చిత్రమూలము, జాజికాయలు, వీనినిగుంటగల గరాకు రసముతో ౮ జాములు చక్కగమర్దించి రేగుపండంత మాత్ర చొప్పున ౭ మండలములు పుచ్చుకొనిన సకలశూలలు, ఉదావర్తము,గుల్మములు, అగ్నిమాంద్యము ఇవిమానును.

నృపతివల్లభరసము—పాదరసము, అమరశిలగంధకము, అభ్రకభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, లవంగాలు, ఏలకపండ్లవిత్తులు, ఇంగువ, ఆకుపత్రి, సొంటి,సైంధవలవణము, ఓమము, దాచినిచెక్క, జీలకఱ్ఱ, శుద్ధిగలహేమమాక్షికము, గజపిప్పళ్లు, పిప్పళ్లు, మిరియాలు, దుంపపసపు, వీనినిసమభాగములుగగ్రహించి నల్ల మేకపాలతో నవనీతమగునట్లు మర్దించి, రేగుగింజలంతమాత్రలుచేసి అనుపాన విశేషములతో బుచ్చుకొనిన, హృదయశూల, పార్శ్వశూల, మొదలగు సకలశూలలు మానును.

## ఉదావర్తలక్షణము.

రూక్షద్రవ్యములచేతను- నీచధాన్యభక్షణముచేతను- వాయువుప్రకోపించి - మలమునుబంధించి- మలమూత్రములతో జేరుకొని, యూర్ధ్వ

గతంబై హృదయము-వీపు- పొత్తికడుపు- తలవీనియందు నొప్పినికలుగజేసిన ఉదావర్తరోగమనబడును. ఇందుశ్వాసము- కాసము, జ్వరము- ఇవి కూడకలుగును.

చికిత్స—ఈరోగమునందు దేహమునకు చమురుపట్టించి కాచవలయు. ననేకప్రకారములుగా విరేచనమునకిచ్చి మలమును తీయవలయు.

—మ్రంగపండు- దంతిచెక్క- ఇంగువ- కంకుష్ఠము- సైంధవలవణము- బిడాలవణము- బెల్లము- కరుధూపము- ఇవిసమానములుగగూర్చినూరిగోమూత్రమున మర్దించి గుడ్డలోబెట్టివత్తిచేసి ఆసనమున ఎక్కించిన ఉండగట్టిన మలమువెడలును.

—తెగడచెక్క 3 పాళ్లు పిప్పళ్లు ౪ పా- కరకాయలు ౫పా- వీనినికలయబోసినూరియుంటలుచేసిఆసనములోబెట్టినబద్ధమలమువిడుచును

—కరకాయలు, తెగడ, ఉలవలు వీనినికషాయముపెట్టి ఆముదముగలుపుకొనిసేవించిన ఉదావర్తముమానును.

—గోమూత్రము ౧పలములు, పెరుగునీళ్లు౧ప, కడుగు౧ప, ఆముదము, ౧ప, వీనినిజేర్చికలిపిదానిలోరెండుకర్షములయెత్తుఆవాలునూరికలిపివస్తినగట్టిన ఆనాహము, మలబద్ధము, ఉదావర్తముమానును.

అగ్నిముఖచూర్ణము—చిత్రమూలము, అతివస, వస, చెంగల్వకోష్టు, సౌవర్చలవణము, ఇంగువ, పిప్పళ్లు, నేలములకవేళ్లు, గంటుభారంగి, ఓమము, సొంటి, వాయువిళంగాలు, మిరియాలు, మోడి, గజపిప్పళ్లు, యవక్షారము, వీనినిసరిపాళ్లగజేర్చి చూర్ణముచేసి, దానికి సమభాగము కరకాయలపొడికలిపి, ఆచూర్ణమును రెండుమాడలయెత్తుచొప్పున సొంటిరసముతోగాని, ఆవునేతితోగాని పుచ్చుకొనిన, ఆనాహము ఉదావర్తము, పురాణజ్వరములు, వెక్కిళ్లు, శ్వాసకాసములు, హృద్రోగములు మొదలగునవిమానును.

## ఆనాహచికిత్స.

విరుద్ధాన్నపానాదులవలన వాయువు ప్రకోపించిమలమూత్రము

లనుబంధించి ప్రేగులరచుట.కడుపునొప్పివీనినికలుగ జేసిన ఆనాహమనబడును. ఈరోగమునకు ఉదావర్తచికిత్సను చేయవలయు. మఱియు అగ్నిముఖ చూర్ణమును కూడనిచ్చిన ఆనాహముమానును.

## అశీతివాతరోగములు.

విరుద్ధాహార విహారములవలన వాతము ప్రకోపించి,పోట్లు,నొప్పి, పగుళ్లుగలుగుట,ముడుచుకొనుట,ఎండుట,వాచుట మొదలగు లక్షణములుగల ఎనుబది వాతములను బుట్టించును.

౧—మఱియు, కీళ్లు, గణువులు, చేతులు, వీపు, శిరస్సు, తొడలు మొదలగునవయవములీడ్చిపట్టుట, ఎముకలసంధులయందును గణువులయందును మెటికలువిరుగుట, దేహముగగుర్పొడుచుట, అవయవము లెండుట, స్తంభించుట, శిరస్సు, నేత్రములు, నాసిక ఇవిసంకోచమును జెందుట,వణకుగలుగుట, దేహమునందు పగుళ్లుగలుగుట నిదుర బట్టకుండుట, ప్రజ్ఞలేకుండుట, ఆయాసముగలుగుట, స్త్రీలకుబహిష్ఠురక్తము వెడలకుండుట, ఈ లక్షణంబులు వాతరోగంబునగలుగును- మఱియువాతము మిగులదుష్టంబైనయెడ సర్వాంగవాయువు, పక్షవాయువు, ఊర్ధ్వవాయువు, అధోవాయువు, కుంభకవాయువు, సంధివాయువు, కటివాయువు,శిరోవాయువు, మొదలగుననేకవాతరోగములను గలుగజేయును.

చికిత్స—వాతరోగములయందు, అభ్యంగము,వస్తికర్మ,నస్యము, అంజనము చెమటదీయుట, తైలమర్దనము విరేచనమునకిచ్చుట,పుష్టినిచ్చెడిపదార్థములను భక్షింపజేయుట ఈమొదలగుక్రియల నొనర్చవలయు.

—చిత్రమూలము, అగరుసొంటి, కొడిశవిత్తులు, అతివస,కటుకరోహిణి, కరక్కాయలు వీనినిసమాంశములుగగూర్చి చూర్ణముచేసి తేనెతోబుచ్చుకొనిన, మహావాతరోగములుమానును.

—వావిలిఆకు, కానుగాకు, కానుగుచెక్క వీనిలో దేనినైనను వెచ్చజేసికట్టుకట్టిన వాతరోగముమానును.

—దేవదారుపట్ట, ఇంగువ, చెంగల్వకోష్టు, పెద్దసోపు,వస,సైంధవలవణము వీనినిసరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి జిల్లేడుపాలతో నూరి లేపనముచేసిన, అస్థిగతవాయువులుసైతముమానును.

—త్రిప్పతీగ, రాస్న,సొంటి, దేవదారుపట్ట, ఆముదపువేరు వీనిని సరిపాళ్లుగగూర్చికషాయముపెట్టిపుచ్చుకొనిన సమస్తవాతములుమానును.

—ఆముదపువేళ్లు మారేడువేళ్లు, ములక, వాకుడు, పాదరలవణము, సొంటి,పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, ఇంగువ, మాదీఫలపువేరు వీనినిసమాంశములుగగూర్చి కషాయముపెట్టిపుచ్చుకొనిన ధనుర్వాతముమానును.

అర్కాదితైలము—జిల్లేడుపాలు, వావిలాకురసము, చింతాకురసము, మేకపాలు, నూనెవీనినిసరిపాళ్లుగగలిపి,తైలపాకమునగాచి,దేహమునందు మర్దించిన, సకలవాతములుమానును.

ప్రసారిణీతైలము—౧౦౦పలములుగల గొంతెమగొమరుతీగెనసలియగొట్టి నాలుగుతూములనీళ్లలోవేసి తూమెడుగకాచి వడియబోసి, ఆకషాయమునకు సరిపాలునూనె, పెరుగు, పులికడుగు వీనినివేసి, నూనెకు నాలుగుపాళ్లుపాలుబోసి, అతిమధురము, సైంధవలవణము, గొంతెమగొమరుతీగె, దేవదారు, సన్నరాస్నము,గజపిప్పళ్లు, పెద్దసోపు, జటామాంసి,చిత్రమూలము, మోడి, శుద్ధిగలజీడిగింజలు వీనికల్కమును నూనెకు పావపాలువేసి, నీరిగురువరకుకాచి, వడియపోసి, బాధగలచోట మర్దనముచేసిన, వాతకఫవికారములు, కుబ్జ, పంగు, అర్దిత,గృధ్రసీ,ఖంజాదివాతములు,శిరస్సు,చెక్కిళ్లు వీపునడుమువీనినిఈడ్చిపట్టెడివాతములు,ఇతరములగు విషమవాతములునుమానును.

మాషాదితైలము—మినుములు, యవలు,తీటకసివెందవిత్తులు,అగిసివిత్తులు, చిన్నములక, గోరింట, వట్లేరు, దుందిలపువేళ్లువీనినిప్రత్యేకము, పదేసిపలములవంతునగూర్చి దీనికినాల్గింతలనీళ్లుపోసి, నాలవపాలు మిగులునట్లుకాచి, వడియబోసి, ప్రత్తివిత్తులు, జనపవిత్తులు, ఉలవలు, రేగు

వండ్లు, వీనిని బ్రత్యేకముగ పదునాలుగేసి పలములవంతునగూర్చి, దానికినా లుగుపాళ్లనీళ్లబోసి, నాలవపాలుమిగులునట్లుకాచి వడియబోసి, ౧ ప్రస్థ ముగల మొగమేకమాంసములో, ౬౪ పలములనీళ్లపోసి నాలవపాలుమిగు లునట్లుకాచివడియబోసి, ౧ ప్రస్థమునువ్వులనూనెపోసి పైకషాయములన న్నిటినికలిపి, సొంటి, పిప్పళ్లు, పెద్దసోపు, ఆముదపువేళ్లు, చిట్టాముదపు వేళ్లు, గొంతెమగోమరుతీగ, జటామాంసి, కటుకరోహిణి, చెంగల్వకో ష్టు, తిప్పతీగ, సన్నరాష్ట్రము, కలిజేరువీనిని బ్రత్యేకముగకల్కముచేసి౹పప లముచొప్పునవేసి మెల్లనిమంటచే నీరిగురువరకుకాచి, వడియబోసి, బాధ గలచోట మర్దించిన, గ్రీవాస్తంభ, అపబాహుక, అర్ధాంగ, ఆక్షేపక, ఊరుస్తంభ, హస్తపాదకంపన, శిరోగతాది సకలవాతములు మానును.

నారాయణతైలము—చల్లపిల్లివేళ్లు, కోలపొన్న, నేలపొన్న, చిట్టా ముట్టి, పేరాముట్టి, పెన్నేరుగడ్డ, పల్లేరు, మారేడువేళ్లు, గోరింట, రెల్లు, వీనిని బ్రత్యేకముగ ౧౪ పలమువంతున గూర్చి కల్కముచేసి, దానికినాలు గుపాళ్లనీళ్లపోసి, నాలవపాలు మిగులునట్టుల, కాచివడియబోసి, నువ్వు లనూనె ౧ ప్రస్థము, ఆవుపాలు ౧ ప్ర, చల్లపిల్లివేళ్లరసము౧ప్ర, నీళ్లు౧ప్ర, ఇట్లన్నిటిని జేర్చి. వరల, చల్లపిల్లివేళ్లు, దేవదారుచెక్క, చెంగల్వకోష్టు, చిట్టాముట్టి, పెద్దసోపు, జటామాంసి, శ్రీగంధము, గ్రంధితగరము, ఏలకు లు, జాతిపువ్వు, నల్లకలువగడ్డలు, నేలతాటిగడ్డలు, అతిమధురము, ఇప్ప పట్ట, పెన్నేరుగడ్డ, గుమ్ముడుగడ్డలువీనికల్కము నాల్కొకకర్షమువంతు నవేసి, ఆవుపేడపిడకలచేత మెల్లనిమంటవేసికాచి, వడియబోసి, దేహము నందుమర్దించిన, కామోద్దీపనముగలిగి, నిత్యము స్త్రీలరమించుట యందు మిగులసమర్థులయ్యెదరు స్త్రీలు, దేహమునందు బూసికొనినయెడ, యోని శూలములుమాని మంచిసంతానముగలుగును. మఱియు, తలనొప్పులు, ఒడ లునొప్పులు, పాండువు, కామిల, విషబాధలు, మేహవాయువులు, స్త్రీలరక్త స్రావరోగములు మొదలగునవిన్నియుమానును.

భృంగామలకతైలము — గుంటగలగరాకురసము ౮౫ తు, ఉసి

రికోకాయలరసము ౮౫ తు, నువ్వులనూనె ౮౫ తు, ఆవుపాలు ౧౩౦ తు, వీనినికలిపి ప్రొయ్యిమీదబెట్టి పొంగువచ్చుచుండగా యష్టిమధుకము ౫ తు, మంచిగంధము, రక్తచందనము, కటుకరోహిణి, దుంపరాస్నము, కట్టివేళ్లు, కురువేరు, తుంగముస్తెలు ఇవిదినుసుకు ౧౪ తు॥ వీనినిఅన్నిటినిపొడిచేసి, పై తైలాదులలో వేసిదించివడియగట్టి శిరమునకభ్యంగముచేసికొనినను, నస్యముచేసినను, శిరోవాయువులు, నేత్రరోగములు, పీనస, వాంతులు, పైత్యరోగములు, తలత్రిప్పుడు, తలవణుకు, చెవిపోట్లు, ఇవిమానును. దేహము నకుకాంతికలుగును- ముఖము చంద్రబింబమువలెనుండును.

మహావాతరాక్షసము—రసము- గంధకము- అభ్రకము-రజతము కాంతము- ఇనుము- లోహము- ఇత్తడి- కంచు- తాళకము- తామ్రము- ఉల్లిపాషాణము- వెలిగారము- సువర్ణము- నాగము- వీని భస్మములు- మైలుతుత్తము- రససిందూరము- నాభి- వంగభస్మము- నవాసారము - మణిశిల- ఇంగిలీకము- వైక్రాంతభస్మము- వీనినిసమభాగముగాగూర్చి-కుంకుమపువ్వు- చిత్రమూలము- సొంటి- పిప్పలి- మిరియాలు- కురువేరు - కోష్ఠము- కొండబలరక్కసిదుంప వీనికషాయములతో బ్రత్యేకముగ రెండేసి జాములు మర్దించి- వజ్రమూసలోవేసి- రెండుజాములువండి- విదళ, అల్లపురసము- బోతుఆగాకరరసము- ఎర్రఉల్లిగడ్డలరసము వీనితో క్రమముగ మర్దించి-ఘుటికలుచేసి- పూటకు వడ్లగింజయెత్తుచొప్పున అనుపాన విశేషములతోనిచ్చిన- దేహమువణకుట- ధనుర్వాతము- ఆమవాతము-మొదలగు సర్వవాతరోగములుమానును-

మహావాతవిధ్వంసిని—స్వర్ణభస్మము ౧ తు- రజతము ౧తు- గంధకము ౧౧తు- అభ్రకము ౪తు- ప్రవాళము ౪తు- ముత్యభస్మము ౪తు-నాగభస్మము ౧తు- వంగభస్మము ౧తు- లోహము ౪తు- తామ్రము ౪తు- పాదరసము ౧౧తు- నాభి ౧౧తు- మణిశిల ౧౪తు- వెలిగారభస్మము ౧౪ తు- కాంతము ౪తు, ఇంగిలీకము ౧౪తు- శంఖభస్మము ౧౪తు- బిడాలక్షీరము ౫తు- వీనినన్నిటిని నిమ్మపండ్లరసము- జిల్లేడుపాలు- తులసిరసము

నిమ్మపండ్లరసము- త్రిఫలకషాయము- వీనితో ప్రత్యేకముగ మెత్తగ మర్దించి- ఘుటికలుచేసి అడ్డగ యెత్తుచొప్పున పుచ్చుకొనిన సకలరోగములు- సకల వాతములుమాని దేహమునకుబలము- పుష్టికలుగును.

వాతగజసింహారి సాయనము—శుద్ధిచేసినమైలుతుత్తము-రసకర్పూరము- రససిందూరము- ముదాఱుసింగు- వీనినిసమభాగములుగకలిపి - చిం తాకురసముతో మెత్తగమర్దించి- వంకాయనుతొలిచి-దానిలోని గుజ్జుతీసి- అందులో ఔషధమునిమిడ్చి వంకాయముక్కను తొడిమచేతమూసి పలుచగా చీలమన్నిచ్చి లఘుపుటముచేత పచనముచేసి - చల్లారినపిదప- జాజికాయ- కురాసానివామము లవంగాలు వీనినిసమభాగములుగా కలిపి- ఆవునేతితో నవనీతముగామర్దించి- ఇందుపగింజంతమాత్రలుచేసి- పూటకొకమాత్రచొప్పున- యిచ్చిన- వాతరోగములు సకలజ్వరములుమరణశూలలుఇవియన్నియుమానును.

కాలాగ్నిరుద్రరసము— శుద్ధిగలరసము, వసనాభి, గంధకము,ఓమము, కరకతాడి ఉసిరికలు, సజ్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, చిత్రమూలము, జీలకఱ్ఱ, వాయువిడంగాలు, వెలిగారము,సొంటి- పిప్పలి, మిరియాలు, వీనినిసమాంశములుగగూర్చిచూర్ణముచేసి, విషముష్టివిత్తులను మూడుదినములుకలిలోనానబెట్టితీసి చూర్ణము చేసి యీచూర్ణమును, పైదానికి సమముగగలిపి, నిమ్మపండ్లరసముతోనొకదినముమెత్తగ మర్దించి, కందిగింజంతమాత్రలుచేసి, నెయ్యి మిరియాలపొడి వీనియనుపానముతో బుచ్చుకొనిన, కుక్షివాతము మొదలగు సకలవాతములు, అగ్నిమాంద్యము, గుల్మములు ఇవియన్నియుమానును.

దాడిమాదిఘుటికలు—శ్రీగంధము, తంగేడువిత్తులు, నేలతాటిగడ్డలు, ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు, ఖర్జూరపపండ్లు, అతిమధురము,దాడిమపండ్లు, తేనెమొరలిబంక వీనిని సరిపాళ్లుగ గూర్చి, వీనికన్నిటికిసమముగ, జాజియాలు, అంతటికిని ఆవ పాలు సింధూరమును జేర్చి మర్దించి పూటకుచిన్నమెత్తుచొప్పున ఆవువెన్నతో బుచ్చుకొను

చుండిన వాతము వలనగలిగెడి నష్టవీర్యదోషముహరించి శుక్రవృద్ధిని,లింగ వృద్ధినికలుగజేసి నూర్గురుస్త్రీలతో రమింపగల శక్తినిగలుగ జేయును- అవ సూనె పులుసు, స్త్రీసంగమము ఇవివర్జ్యములు.

వాతాంతకరసము—స్వర్ణము,రజతము, తామ్రము, కాంతము-లోహము, అభ్రకము వీనిభస్మములు, గంధకము, వైక్రాంతభస్మము, పగడభస్మము, తాళకభస్మము, వీనినిసమాంశములుగగూర్చి చిత్రమూలరసముతో నాలుగుజాములుమర్దించి, బిళ్ళచేసి, యెండించి, కుక్కుటపుటమునందువేసి, చల్లారినపిదప, సన్నగచూర్ణముచేసి, దానికి అవపాలు, రసభస్మము, తాళకభస్మము, వీనినికలిపి, అల్లము, చిత్రమూలము, నిమ్మకాయ, అడ్డసరము వీనిరసములతో ప్రత్యేకముగ నేడేసిసార్లు మర్దన భావనలుచేసి గురిగింజంతమాత్రలుచేసి తేనెతోగాని, నేతితోగాని పుచ్చుకొనిన, పక్షవాతాది సకలవాతములుమానును- వంధ్యాస్త్రీలు పుచ్చుకొనిన సంతానముగలుగును, పురుషులకు వీర్యవృద్ధికలుగును.

వాతవిధ్వంసనరసము—శుద్ధిగలరసము, గంధకము,సీసభస్మము, వంగభస్మము, లోహము,తామ్రము, అభ్రకభస్మము, సొంటి,పిప్పళ్లు,మిరియాలు శుద్ధిగలవెలిగారము, ఇవిసరిపాళ్లు,వసనాభి, ౭౪ పాలు, వీనిని సొంటి పిప్పలి మిరియాలకషాయముతో మూడుసారులును, నేలతాటిగడ్డలు, చిత్రమూలము, గుంటగలగరాకు వీనిరసములతోను, చెంగల్వకోష్టుకషాయముతోను మూడుసారులును,వావిలి, అల్లము,నిమ్మపండ్లు,అడ్డసరము, గంజాయియాకు వీనిరసములతో వేర్వేరుగమర్దనభావనలుచేసి గురిగింజంతమాత్రలుచేసి, రెండేసిమాత్రలుచొప్పున అనుపానవిశేషములతో నిచ్చిన, వాతరోగములు, శూలలు, కఫవికారములు, సన్నిపాతములు, అగ్నిమాంద్యము, కుష్టువు ఇవిమానును.

స్పర్శవాతమునకుచికిత్స—పాదరసము ౧పాలు- హరితాళము ౮పా- ఎండినగంజాయియాకు ౮పా- బెల్లము ౧౬పా- వీనిని బాగుగమర్దించి రెండుమినుములంత మాత్రలుచేసి పూటకు ౧ మాత్రచొప్పున రెండుపూ

టలయందును రెండుమాసములు పుచ్చుకొనిన,పొట్లుపొడుచుచుస్పర్శజ్ఞానములేని స్పర్శవాతముమానును.

—రసము అరపాళ్లు, విషముష్టిగింజలు ౧౦పా,గంధకముగ౨పా, సొంటి, పిప్పలి, మిరియాలు, కరక తాడి యుసిరికలు, జీడిగింజలు, తుంగగడ్డలు, రేణుకలు, మోడి,చెంగల్వకోష్టు, పెన్నేరుగడ్డ, వసనాభి, నాగకేసరములు, ఇవిప్రత్యేక మొక్కొకపాలు, వీని నన్నిటిని చూర్ణముచేసి ౨౪పాళ్లు పాతబెల్లముకలిపిమర్దించి రేగుపండంతమాత్రలుచేసిఒకొక్కమాత్రచొప్పున భక్షించినయెడ స్పర్శవాతము మానును.

## స్వరభేదచికిత్స.

వాకుడువేరు సమూలమునుత్రొక్కి రసముతీసి కాగబెట్టి ఆవునేయికలిపి పుచ్చుకొనినను- సన్నరాష్ట్ర- చిట్టాముదపువేళ్లు-పల్లేరుకాయలు- సొంటి- పిప్పలి- మిరియాలు- వీనినిసరిపాళ్లుగగూర్చికషాయముపెట్టి నేయికలిపి పుచ్చుకొనినను స్వరభేదము- శ్వాసకాసలు మానును.

—సైంధవలవణము- పిప్పళ్లు- తానికాయలు వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముగొట్టి వస్త్రగాళితముచేసి వుల్లనికలికలిపితాగిన స్వరభేదము మానును- ఉసిరికకాయల పప్పును పొడిచేసి పాలలోగలిపి పుచ్చుకొనినను మానును- శ్వాసకాసచికిత్సలుస్వరభేదమునందును ఉపయోగించును.

## అరోచికచికిత్స.

సొంటి- పిప్పలి-మిరియాలు- వీనినిసరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి- శర్కర- వెలగపండుగుజ్జు- తేనె- వీనినికలిపి- పక్వముచేసి - నెల్లికాయంత తీసుకొని నోటిలోబెట్టుకొని రసమునుమ్రింగుచుండిన- అరుచిమానును.

—మాదీఫలపుకింజల్కములు- సైంధవలవణము- వీనినిచూర్ణముచేసి-తగుమాత్రమునేయికలిపి రెండుపూటలయందును భక్షించినను పుల్లదానిమ్మగింజలనుగాని- తియ్యదానిమ్మగింజలనుగాని నమిలిమ్రింగినను అరుచి మానును.

## మేదోరోగచికిత్స.

దివానిద్ర - సంచారములేమి- శీతల మధుర స్నిగ్ధ పదార్థభక్షణ ము మొదలగువానివలన మేదస్సు వృద్ధియైశరీరమునుస్థూలింపజేయును-అం దువలన నరు డేకార్యము జేయుటకును అసమర్థుడగును.

చికిత్స—కరక తాడి ఉసిరికలు-సొంటి- పిప్పలి-మిరియాలు- సైం ధవలవణము-వీనినిచూర్ణముచేసి తగుమాత్రము నువ్వులనూనెబోసి-మర్దిం చిరేగుగింజంతమాత్రలుచేసి- ఆరుమాసములు పుచ్చుకొనిన-మేదోరోగము మానును.

—కరకతాడియుసిరికలు- భాగవేళ్లు-అతివస- చిత్రమూలము-చెం గల్వకోష్టు- సొంటి- పిప్పళ్లు- ఆవాలు-కొడిశెవిత్తులు-తిప్పతీగె-పసపు- తెల్ల తెగడ- ఏడాకులరటి- వస- అడ్డసరము- తెలపట్ట- వేపపట్ట- వీనినిప్రత్యే కముగ ఒకొక్క-కర్షతులము వంతునగూర్చి చూర్ణముచేసి ఒకవీసెనువ్వు లనూనెపోసి- పొయిమీదబెట్టిమెల్లనిమంటచేపక్వముగవండిదించుకొనిప్రా తకు ౪ పలమువంతున పుచ్చుకొనుచుండినను - అభ్యంగముచేసికొనినను- నస్యవస్తికర్మలనొనర్చినను- శరీరస్థౌల్యము బద్ధకముమొదలగు వికారము లుమానును.

### విసర్పి విస్ఫోటక లక్షణములు.

వాతాది ప్రకోపముచే, రక్తము, మేదస్సు, మాంసము చర్మము ఇవిచెడి, ధా తువులయందు వ్యాపించి, జ్వరము, వాంతి, అతిసారము, తాపము, ఇడలిక, అరుచి-అ గ్నిమాంద్యము, మాంసము క్షీణించుట ఈ లక్షణములుగల, విసర్పిరోగమును గలుగ జేయును. ఇట్టియు, జ్వరము, బొబ్బలుగలిగినయెడ విస్ఫోటకమనబడును.

చికిత్స—కరకతాడియుసిరికలు - అడ్డసరము - నేలవేము - చేదుపొట్ల- కటు కరోహిణి - వేపపట్ట శ్రీగంధము వీనిని సగిపాళ్లుగగూర్చి కషాయముగాచియిచ్చిన - విసర్పి విస్ఫోటకములు - తాపము- జ్వరము - దురద- వాపు ఇవియన్నియుమానును.

—నాగమల్లివేరు - జాజి ఆకు - రేణుకలు - నల్లఉమ్మెత్తవేరు - భాగవేళ్లు - చెంగల్వకోష్టు - మణిశిల వీనిని సమాంశములుగ గూర్చి చూర్ణముచేసి- ఆచూర్ణమున కుసరిపాలు తిలతైలముకలిపి కొంచెము పాదరసముచేసి కల్వమునందు బాగుగమర్దించి

జేహమునకు బూసికొనిన - దురద - కప్పుపు - కాలుసేతులపగుళ్లు - విసర్పి మొదల గునవిమానును.

మసూరికా లక్షణము.

జ్వరము - దురద - అరుచి - భ్రమ - తీవ్రవేదన ఈలక్షణములతోగూడి - ఉరు సెనగలవంటి బొబ్బలుజనించిన మసూరికా రోగమనబడును.

చికిత్స — శ్రీగంధము - నాగకేసరములు - పసపు - మ్రానిపసపు - ఉరిసెనపువిత్తులు - వట్టివేళ్లు - కుంగమపూలు - తామరగడ్డలు - చేదుపొట్ల - లొద్దుగపట్ట - వాయువిళంగాలు - వీనిని సమాంశములుగ గూర్చి కషాయముగాచి - దానిలో పసపు చూర్ణమును - ఉసిరికవరుగు చూర్ణమును కొంచెముగ వేసి త్రాగించిన - మసూరిక - విసర్పి - విస్ఫోటకము - జ్వరము - వాంతి ఇవిమానును.

ముంగుకులేపనము — శ్రీగంధము - లొద్దుగపట్ట - చెంగల్వకోష్టు - మ్రానిపసపు - పండిన మర్రిఆకులు - త్రేంకణపువ్వు వీనిని సమాంశములుగ గూర్చి - కల్కముచేసి - దీనికిసరిపాలు తిలతైలముపోసి తైలపాకముగాచి - ముఖమునకుబూసికొనిన - ముఖమునందలి నలుపు - మంగు ఇవిమాని ముఖముచంద్ర బింబమువలెనుండును.

మొటిమెలకు — మద్దిపట్ట - మంజిష్ఠి - అడ్డసరము వీనిని అవుపాలలోను - తేనెతో నూరి ముఖమునందు బూసికొనిన - యౌవనమునందు బుట్టెడి మొటిమలుముంగు ఇవి మానును.

వేనుకొరుకుటకు — వాకుడుపండ్లరసములో తేనెను కలిపిగాని - జీడిగింజల నూనెలో గురిగింజలను చాదిగాని లేపనముచేసిన - వేనుకొరుకుట మాని వెండ్రుకలుమొలచును.

పేలునశించుటకు — కాదరసమును నల్లయుమ్మెత్తాకు రసముతో మర్దించి దానిని వస్త్రమునకుబూసి యావస్త్రమును శిరస్సుకుకట్టి మూడుజాములుంచిన పేలన్నియు మాడి రాలిపోవును.

వెండ్రుకలు మొలచుటకు — అతిమధురము - చెంగల్వకోష్టు - పారపప్పు - మినప్పప్పు - తెల్లగురిగింజలు - సైంధవలవణము వీనిని సరిపాళ్లగగూర్చి చూర్ణముచేసి - దానిలో కొంకాయపాలుపోసికలిపి - తలకు పట్టించిన - బట్టతలయందు గూడ వెండ్రుకలు మొలచును.

— అతిమధురము - లక్క - సాధి - గురిగింజాకు వీనిని పులికడుగుతో నూరి - కుంచినూనెను ఎక్కువగబోసి తైలపాకముగగాచి - బట్టతలకు లేపనముచేసిన - నిస్సంశయముగ వెండ్రుకలు మొలచును.

వెండ్రుకలునల్లనగుటకు — కరకకాయ తానికాయ ఉసిరికలు - [illegible] [illegible]

వీనిని సరిపాళ్లుగ గూర్చి- గుంటగలగరాకు రసముతోను- గొర్రెమూత్రముతోను బాగు గమర్దించి- వెంట్రుకలకు బూసిన- అకాలపలితముపోయి వెంట్రుకలునల్లనగును.

కరక్కాయలు ౨ పల, తానికాయ ౧ప- ఉసిరికవరుగు ౨ ప. మామిడిపిక్క ౫ ప- ఇనుముపొడి ౧ తు- వీనిని చూర్ణముచేసి యినుపగిన్నెలోవేసి దానిలో నుంచి నూనెపోసి మర్దించి యొకదినము నాననిచ్చి తరువాత వెంట్రుకలకు లేపనముచేసిన- అకాలమునందు నెరసిన వెంట్రుకలు నల్లబడును.

నీలికాదితైలము— నీలిఆకు- గుంటగలగరాకు- మొగలిగడ్డలు- పచ్చపూలగోరింట- మద్దిపూలు- పేగిసపూలు- తామరసమూలము- గ్రంధితగరము - నల్లనువ్వులు- ఇనుముపొడి- ప్రేంకణపువేళ్లు- దానిమ్మబెరడు-తిప్పతీగె - కరకతాడియుసిరికలు- వీనిని ప్రత్యేకము ౧ కర్షమౌ చొప్పున గూర్చి కల్కముచేసి- ఆకల్కమునకునాలుగింతలు మంచినూనె- నూనెకు నాలుగుపాళ్లు త్రిఫలకషాయము- అంతమాత్రముగుంటగలగరాకురసము వీనినిబోసి తైలపాకముగగాచి- వడియగట్టి వెంట్రుకలకుబూసిన- వెంట్రుకలమొదళ్లు స్థిరములైరాలక బలముగనుండును. అకాలపు నెరపు పోయి వెంట్రుకలునల్లనగును.

భృంగరాజతైలము— కరకతాడియుసిరికలు- సుగంధిపాల- ఇనుపచిట్టెము వీనినిసమభాగములుగగూర్చి వీనికన్నిటికి నాలుగింతలు మంచినూనె- నూనెకునాలుగుపాళ్లు గుంటగలగరాకురసము వీనినికలిపి తైలపాకముగగాచి దించుకొని శిరమునమర్దించిన- అందలిపోట్లు, పేనుకొరుకుటమాని-అకాలమునందు నెరసిన వెంట్రుకలునల్లనగును.

వెంట్రుకలురాలుటకు— నేపాళపువేళ్ల- చేదుబీరపండ్లు - తెగడ- వాడగన్నేరువేళ్లు- వీనినినూరి కల్కముచేసి- నాలుగింతలమంచినూనె - నూనెకునాలుగింతలునీళ్లు వీనినిపోసి - దానిలో అరటియాకులమసినివేసి తైలపాకముగగాచి వడియబోసి - వెంట్రుకలుండెడి స్థలంబునబూసిన నవి రాలిపోవును.

గజ్జికురుపులకు— పాదరసము- మానిపసుపు- పసపు- మిరియాలు- గంధకము- మణిశిల- గంగిసిందూరము- నల్లజీలకర్ర- పెద్దజీలకర్ర వీనిని సరిపాళ్లుగగూర్చి నేతిననూరి మూడుదినములు దేహమునబూసిన గజ్జి కుదరమానును.

—రావిపట్టమసి- కొత్తరాతిసున్నము వెన్న వీనిని కలిపి మర్దించి పూసికొనిన రొండిమొదలగు స్థలములయందలి దురద తీట మానును.

—జిల్లేడాకులరసములో పసపుపొడిని- ఆవతైలమును కలిపి వెచ్చచేసి పూసికొనిన- దురదగజ్జిమానును.

అగ్నిదగ్ధమునకు— యవలమసిలో టెంకాయనూనెకలిపి బొబ్బలపైన పూసినకాలినబొబ్బమానును.

—లొద్దుగపట్ట- అందుగుబంకతో జేసిన ధూపద్రవ్యము- శ్రీగంధము-మంజిష్ఠ- బాగపేళ్ల- అతిమధురము వీనిని సరిపాళ్లగ గూర్చి చూర్ణముచేసి- నేయి- తేనె- మైనము వీనిని వేసి కలిపి బాగుగ కాచి చల్లారినపిదప-వ్రణంబులుగలచోట పూసిననవి మానును.

## ముఖదంతాదులయందలి రోగములకు చికిత్సలు.

పెదిమెలయందలి రోగమునకు—దేవదారుబంక- అందుగుబంక వీనితో జేయ బడిన ధూపద్రవ్యములు- దేవదారుపట్ట- అతిమధురము- గుగ్గిలము వీనిని సమాంశము లుగ గూర్చి జలముచే నూరి పెదిమెలయందు బూసిన నందలి పగుళ్లు మొదలగు రోగము లు మానును.

నోటిపుండ్లకు—తిప్పతీగ- దీపద్రాక్ష- మానిపసపు- కరకకాడి యుసిరికలు - మునగగొండివేరు- జాపత్రి వీనిని కషాయముపెట్టి దానిలో తేనెనుగలిపి పుక్కిలించి యుమిసినన విమానును.

కంఠరోగమునకు—అతివస- అగరుసొంటి- దేవదారు- కటుకరోహిణి - కొడి సెపట్ట- తుంగముస్తెలు వీనిని సమాంశములుగ గూర్చి గోమూత్రముచే కషాయము పెట్టి- పుచ్చుకొనిన కంఠరోగములు మానును.

—పసపు- మానిపసపు- రసాంజనము- పిప్పళ్లు- అగరుసొంటి- చాగపేళ్లు-యవక్షారము వీనినిసరిపాళ్లగ గూర్చి చూర్ణముచేసి దానిలో తేనెగలిపి రేగుపండంతమాత్రలు చేసి నోటయునిచికొని రసమును మ్రింగుచుండిన కంఠరోగములన్నియు మానును.

ముఖపాకమునకు— సొంటి- నువ్వులు - అతిమధురము- వీనిని సమాంశములు గ గూర్చి కషాయముపెట్టి పుక్కిలించి యుమియుచు- పెసరపప్పు పులగము భక్షించిన ముఖపాకరోగము మానును.

—పోకచెక్క-జరిపేలాలు-జాజికాయ వీనిని సరిపాళ్లగ గూర్చి చూర్ణముచేసి అరపలముచొప్పున చన్నీళ్లలోవేసి పుచ్చుకొనిన ముఖరోగములు మాని నాలుకకు రుచిగలుగును.

నోటిదుర్వాసనకు— చెంగల్వకోష్ఠును- పొడిచేసి దానినితేనెతో నూరి దంత ధావనముచేసిన నోటిదుర్గంధము మానును.

పండ్లనొప్పికి— వేపచిగుళ్లు- చేదుపొట్ల- జువ్వి- మామిడి - అత్తి- జువ్వి-రావి- జాజిఆకులు- జాజికాయ - వీనిచిగుళ్లను సరిపాళ్లగ గూర్చి కషాయముపెట్టి పుక్కి లించి యుమిసిన దంతములనొప్పినోటి అరుచిమానును.

—చెంగల్వకోష్టు- మానిపసపు - పసపు - మంజిష్ఠ- తుంగముస్తెలు- అగరుసొంటి లొద్దుగపట్ట కటుకరోహిణి- చాగపేళ్లు- గాజుప్పు వీనినిసరిపాళ్లగ గూర్చి పొడిచేసి దా

నితో ప్రతిదినము పండ్లకుతోమినయెడ- దంతములగుండా స్రవించెడి రక్తము, తు తెములవరద నొప్పి మానును.

—శుద్ధిగలమైలుతుత్తము- సొంటి పిప్పళ్లు- కరక్కాయలు- ఉప్పు- లొద్దుగపట్టు వీనిని సమాంశములుగనూర్చి చూర్ణముచేసి- దానితో నిత్యము దంతధావనముచేసిన- కదలెడి దంతములు గట్టిపడి పటుత్వముగలిగియుండును.

చిలునాలికపడినందుకు— శుద్ధిగల వెలిగారపు పొడిని నాలుకపైరాచి - కర క్కాయలు- యవక్షారము- చిత్రమూలము- సొంటి- పిప్పళ్లు - మిరియాలు - వీనినిసరి పాళ్లుగనూర్చి చూర్ణముచేసి నాలుకపైరాసిన- చిలునాలుక సరిగా నుండును.

## కర్ణరోగచికిత్స.

సైంధవలవణము కలిసిన మేకపోతుమూత్రమును కొంచము వెచ్చచేసి దానిని చెవిలోపోసిన చెవియందలి తీవ్రమైనధ్వని- చీముకారుట- పోట్లు- ఇవిమానును.

—చెంగల్వకోష్టు- చల్లపిల్లిగడ్డలు- ఇంగువ- సొంటి- వస- సైంధవలవణము- దేవదారు- వీనినిసరిపాళ్లుగనూర్చి మేకపోతు మూత్రముతో నూరి కల్కముచేసి దాని లోమంచినూనెకలిపి- మెల్లనిమంటతో తైలము పక్వమగువరకుకాచి చల్లార్చి చెవిలో బోసిన కర్ణరోగములన్నియు మానును.

—మాదీఫలము- మామిడిచిగుళ్లు- అల్లము, వెలగకాయ- వీనిరసముతీసికొంచెము వెచ్చచేసి చెవిలోపోసిన చెవియందలి శూలలుమానును.

—మారేడుపండును ఆవుపంచితముతోనూరి కల్కముగావించి దానిలో మంచినూనెకలిపికాచి- తైలముపక్వమగునపుడు - అందులో సర్జక్షారము- యవక్షారము- వెలిగారక్షారము- వీనినిపొడిచేసివేసి చల్లారినపిదప వడియకట్టి చెవిలోపోసిన చెవు డునివర్తించును.

—సైంధవలవణము- పిప్పళ్లు - కుంగముస్తెలు- వస- సొంటి- ఇంగువ-వెల్లుల్లి వీనినిసరిపాళ్లుగ నూర్చి చూర్ణముచేసి అందులో పందుబిల్లెడుఆకులు - మాదుకపట్టు- వీనిరసమును పోసినూరి దానితోనే కల్కముచేసి ఆకల్కమునకు సమభాగముగ మంచినూనె పోసి - తైలపక్వమగు వరకుకాచి చెవిలోపోసిన కర్ణరోగములు-చెవుడు నివర్తించును.

## నాసారోగచికిత్స.

జాజిపువ్వులు- మల్లెపువ్వులు- ఎర్రగన్నేరుపువ్వులు- వీనిరసముతీసి ఆరసము నకు సమముగ మంచినూనెకలిపి తైలము పక్వమగువరకుకాచి ముక్కులో పోసిన - ముక్కునుండి కారెడురక్తము మానును.

—తెల్లజీలకఱ్ఱను పొడిచేసి దానిలో పంచదారనుకలిపి నస్యముచేసిన- చీము కారుట- దుర్వాసన- మొదలగువానితో గూడిన నాసికారోగములు మానును.

—దానిమ్మ-మారేడుపండు- సొంటి - చెంగల్వకోష్టు - పిప్పళ్లు - వీనిని సరిపాళ్లుగగూర్చి కల్కముచేసి- ఆకల్కమునకు సమానముగ నేతినికలిపి తైలముపక్వమగునట్లు కాచి ముక్కునందుపోసిన- మిక్కిలితుమ్ములతోగూడిన నాసికారోగములుమానును.

—కుంకుమ పువ్వును- నేతితోనూరి కొంచెము వెచ్చచేసి నస్యముచేసిన నాసికారోగములు మానును.

## నేత్రరోగచికిత్స.

ఈరోగములయందు ముందుగ- కరక- తాడి-యుసిరికలు-కావిరాయి-మానిపసపు- లొద్దుగపట్ట- వీనిని సరిపాళ్లుగ కూచిగా కషాయముపెట్టి ఈకషాయముతో నేత్రములను కడిగి తరువాత రసాంజనము- శ్రీగంధము-కావిరాయి- వీనినిగంధముతీసి నేత్రములకు చుట్టులేపనము చేసిన- నేత్రరోగములుమానును.

నారికేళాంజనము— మానిపసపు. కరకతాడి యుసిరికలు యష్టిమధుకము వీనిని ప్రత్యేక మొక్కొకపలమువంతున కూచిగా దంచి ౧౬వడినారికేళోదకములోవేసి- అష్టభాగావశిష్టముగ కషాయముకాచి - దానిని ఒకకుండలోబోసి మెల్లనిమంటచేత కలగాచి ౫ పలములుగా దించుకొని చల్లారినతరువాత- పచ్చకర్పూరము- సముద్రపు నురుగు- రసాంజనము- కావిరాయి-శుద్ధిగలతాలుతుత్తము-సైంధవలవణము-మిరియాలు వీనిని చూర్ణముచేసి దినుసుకు పాతికనిష్కముచొప్పున పైయౌషధమునందు వేసి తేనె ౧౪ తులములు వేసికలిపి నేత్రములకు పెట్టిన- సకలనేత్రరోగములుమానును.

—సొంటి- కరక్కాయ-శంఖము-పసపు- తెల్లగంటెనవేరు. దానివిత్తులు - దానిపూలు. వీనినిసరిపాళ్లుగగూర్చి గంటెనవేరు రసముచేతనుదించి నేత్రములందుం దురాచిన, గరించిన నేత్రములుకూడసరలవచ్చును.

—సొంటి- పిప్పలి- మిరియాలు- శర్కర- రసాంజనము. సముద్రపునురుగు- చిల్లగింజలు- శంఖము- సైంధవలవణము- వాయువిడంగములు - మణిశిల - జాజికాయ- కోడిగుడ్లపెంకులు వీనిని సరిపాళ్లుగగూర్చి దంచి తేనెపోసినూరి- దానిని ఒకగుడ్డకు పట్టించి వత్తులుచేసి కన్నులకురాచిన - చీకట్లు కమ్ముట- పొరలునీరుగారుట-పుసులు మొదలగునవిమానును.

—శుద్ధిగలపాలతుత్తము- తాలుతుత్తము హేమమాక్షికము-కురువేరు- సైంధవలవణము- సొంటి- పిప్పలి- మిరియాలు- వెలిగారము- వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి తేనెచేర్చిబాగుగ మర్దించి కడ్డీలుచేసి నీడనెండించి నీళ్లలోనూరి కన్నులకురాచిన- కంటిపువ్వులు మొదలగు నేత్రరోగములుమానును.

—పిప్పళ్లను- ఆవుపేడరసముతో గంధముదీసిగాని- మిరియాలను పెరుగుతో గంధముదీసిగాని నేత్రములకువేసిన రేచీకటిమానును.

తిలపుష్పాంజనము— మిరియాలు ౨ పాళ్లు, శుద్ధిగలపాలతుత్తము ౮ పా - నువ్వుపూలు ౭ పా - వీనిని నిమ్మపండ్లరసముతో నూరి కణికలుచేసి - నేత్రములకురాచిన- తిమిరములు- పొరలు- కంటిపొలుపు- దుర్మాంసముదురద మొదలగునవిమానును

నయనామృతము— శుద్ధిగల మైలుతుత్తము- సౌవీరాంజనము- రసాంజనము- జానిపసపు - పచ్చకర్పూరము- కటుకరోహిణి- గవ్వలు- సముద్రపునురుగు - శ్రీగంధము. యష్టిమధుకము- శంఖము- సైంధవలవణము - సొంటి - పిప్పలి - మిరియాలు - వీనిని సరిపాళ్లుగకూర్చి మాదీఫలరసములో మర్దించి కణికలుచేసి తేనెలోబాది నేత్రములకు వేసిన సకలనేత్రరోగములుమానును.

నృపవల్లభతైలము—సొంటి- సైంధవలవణము- యష్టిమధుకము-వాయువిడంగములు- గ్రంథితగరము- సదాప,ఆముదపువేరు- మునుబాల- దుంపరాష్ట్రము-గుంటగలగర- వీనినిసరిపాళ్లుగకూర్చి చూర్ణముచేసి దానిలో నల్లనువ్వులనూనె-శిలాజిత్తు-మేకపాలు- నూనెకు నాలుగుపాళ్లు గుంటగలగరాకురసము వీనినికలిపి చిక్కగనుండునట్లుకాచిబిందువులను ముక్కులోవిడిచిన నేత్రరోగములుమాని గరుడునిదృష్టివంటి దృష్టిగలుగును- శిరోరోగములుమానును- వెంట్రుకలూడినచోట మరలమొలుచును నెరసినవెంట్రుకలునల్లనగును.

## శిరోరోగచికిత్స.

కరకతాడియుసిరికలు- తిప్పతీగె- వేపపట్ట - పసపు-నేలవేము- వీనినిసరిపాళ్లుగ కూర్చికషాయముకాచి,దానిలోనారవపాలు బెల్లముగలిపి సేవించిన-కనుబొమలనొప్పి- నుదుటిశూల- చెవులసంధులయందలి పోట్లు ఒంటితలనొప్పి- రేచీకటి- నేత్రశూల- దంతశూల ఇవిమానును.

—ఆవాలు - లవంగపట్ట - తాళీశపత్రి - మునగవిత్తులు- కానుగువిత్తులు వీనిని చూర్ణముచేసి నస్యముచేయించిన- శిరోరోగములన్నియుమానును.

—కుంకుమపువ్వును నేతితోవేయించి చూర్ణముచేసి దానిలో చక్కెరనుగలిపి నస్యముచేసిన- కనుబొమలు- నుదురు- నేత్రములు- కర్ణములు వీనియందలిశూలలు- ఒంటితలనొప్పి- సూర్యావర్తము ఇవిమానును.

—ఆముదపువేరుపట్ట- చెంగల్వకోష్టు వీనినికలితోనూరి- శూలగలస్థలమున పట్టించిన మానును. తెల్లగంటెనపువ్వులను-నీళ్లతోనూరి పట్టించినను- శిరశ్శూలమానును.

—మిరియాలు- వరిబియ్యము- వీనిని గుంటగలగరాకు రసముతోనూరి పట్టించిన- ఒంటితలనొప్పిమానును.

—తెల్లగంటెనవిత్తులు- దానివేరు- వీనినినీళ్ళతోనూరి నస్యముచేసిన-ఒంటితలనొప్పిమానును.

—చెంగల్వకోష్టు- సొంటి- వట్టివేళ్లు- గ్రంధితగరము - దేవదారుపట్ట - వీనిని సరిపాళ్లగనూర్చి కలితోనూరి దానిలో మంచినూనెకలిపి తైలము పక్వమగువఱకు కాచి శిరస్సుకుపట్టించిన తలనొప్పిమానును.

## గర్భిణీరోగచికిత్స.

తిప్పతీగ- చిన్నపల్లేరుకాయలు- సన్నరాష్ట్ర వీనిని సరిపాళ్లగనూర్చి కషాయముపెట్టి గర్భిణీస్త్రీలకు త్రాగించిన గర్భశూలలు మానును.

—కరకతాడి యుసిరికలు- తిప్పతీగ- నేలవంతివేరు వీనిని సమాంశములుగ గూర్చి కషాయముగాచి- మినపప్పు- మిరియాలు- పిప్పళ్లు- చల్లపిల్లివేళ్లు - చెంగల్వకోష్టు- సైంధవలవణము వీనిని పైకషాయముచేనూరి, ఒకగుడ్డకుపట్టించి దానినిలావుగవత్తిచేసి యోనియందునిచిన గర్భశూలలు- రక్తస్రావరోగములుమానును.

—ఆముదపువేరు- పల్లేరువేరు- దర్భవేళ్లు- రెల్లువేళ్లు-వీనినిసరిపాళ్లగగూర్చి కషాయముపెట్టి దానిలో ఆవుపాలు శర్కర వీనినికలిపి త్రాగించిన గర్భశూలలు మానును.

—దేవదారునెలు- చేదుపొట్ల- యష్టిమధుకము- మిరియాలు- సొంటి-గంటుభారంగి- వెల్లుల్లి- పిప్పళ్లు- వీనినిసమభాగములుగ కషాయముపెట్టి తేనెతోనిచ్చిన గర్భశూలలుమానును.

### గర్భిణీజ్వరాదులకు ప్రతిమాసమునందు నియ్యవలసినకషాయములు.

ప్రథమమాసమునందు—తుంగముస్తెలు- దానిమ్మవేరు - దానిచెక్క- సొంటి వీనిని కషాయముపెట్టి ఇయ్యవలయు.

ద్వితీయమాసమునందు—తుంగముస్తెలు- పర్పాటకము- రెడ్డినానబ్రాలు- మోడి - సొంటి - వీనిని సమభాగములుగకూర్చి రెండుమానికెల నీళ్లుపోసి కషాయముపెట్టినాలుగవంతుమిగిలించి ముందుగ గరిటెడుపాలను త్రాగించి తరువాత ఆకషాయము నియ్యవలయు.

తృతీయమాసమునందు—నేలవేము- గ్రంధితగరము- పాలవేళ్లు- చెంగల్వకోష్టు సొంటి- విరజాజిపువ్వు- సహదేవి వీనిని సమాంశములుగా గూర్చి కషాయము పెట్టి ముందుగ అరగంటెడు తేనెను త్రాగించి తరువాత కషాయమునియ్యవలయు.

చతుర్థమాసమునందు — ద్రాక్షపండు - రెడ్డినానబ్రాలు- పాలవేళ్లు - చెంగల్వకోష్టు - అతివస - వేపవేరుపట్ట వీనిని సమాంశములుగ కషాయము పెట్టి ఇయ్యవలయు.

పంచమమాసమునందు— ఊలగుంజా, దానిమ్మపండు, పల్లేరు, సహదేవి, సొంటి, తామరతూండ్లు, నేలవేము వేళ్లు, వీనిని సమభాగములుగ కషాయము పెట్టి ఇయ్యవలయు.

షష్ఠమాసమునందు— తుంగముస్తెలు, చెంగల్వకోష్టు, రెడ్డినానబాలు, ఆవుదువేళ్లు, సొంటి, నల్లకలువదుంప, కటుకరోహిణి మారేడువేళ్లు, వీనిని కషాయముగాచి ఇయ్యవలయు.

సప్తమమాసమునందు— సొంటి, దానిమ్మపండు, ఖర్జూరము, తిప్పతీగ, వీనిని సమభాగములుగా గూర్చి కషాయము కాచి ముందుగా గండెడు పాలను త్రాగించి కషాయము నియ్యవలయు.

అష్టమమాసమునందు— యష్టిమధుకము, ఇప్పచెక్క, మనుబాలవేళ్లు, ధనియాలు, పల్లేరు. తుంగముస్తెలు, పుష్కరమూలము, సొంటి, వీనిని సమభాగములుగా కషాయము పెట్టి, ముందుగా- తేనెను పాలను త్రాగించి తరువాత కషాయము నియ్యవలయు.

నవమమాసమునందు— యష్టిమధుకము, ఇప్పచెక్క, లొద్దుగవేళ్లు, మనుబాల తీగె- పాలవేళ్లు, సొంటి వీనిని సమభాగములుగ గూర్చి కషాయము పెట్టి, ముందుగ గండెడు పాలను త్రాగించి పిదప సోలెడు కషాయము నియ్యవలయు.

దశమమాసమునందు— మనుబాలతీగె- పాలవేళ్లు, సుగంధిపాలవేళ్లు, చల్లమిల్లివేళ్లు, సొంటి వీనిని సమాంశములుగా గూర్చి కషాయము పెట్టి ఇయ్యవలయు.

సుఖప్రసవమునకు— అతిమధురము, మాదీఫలపు వేరుపట్ట, వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి దానిలో, తేనె నేయి వీనిని కలిపి పుచ్చుకొనిన, గర్భిణీస్త్రీ సుఖముగ బ్రసవించును.

సూతికాజ్వరమునకు— సొంటి- ఓమము- జీలకఱ్ఱ- పెద్దజీలకఱ్ఱ- మోడి- పిప్పళ్లు- పసపు- మానిపసపు- బిడాలవణము- సౌవర్చలవణము వీనిని సరిపాళ్లుగ గూర్చి చూర్ణముచేసి ఆ చూర్ణములో కలిపోసి పక్వముచేసి తరువాత కల్వములో వేసి మర్దించి మాత్రలు కట్టి నీడనెండించి- శరీరతత్వము ననుసరించి యిచ్చిన- సూతికారోగము - ఆమవాతము- శూల- కఫరోగము- ఇవిమాని అగ్నిదీపనము గలుగును. స్తనములయందు పాలను కలుగజేయును.

—సొంటి, పిప్పళ్లు, చెంగల్వకోష్టు- వస, అతివస, దేవదారు, పెద్దగుమ్ముడు, తుంగముస్తెలు, ధనియాలు- నేలవేము, కటుకరోహిణి, కరక్కాయలు, గజపిప్పళ్లు, మరదగొండివేరు, పల్లేరుకాయలు, వాకుడు, పెద్దములకి, తిప్పతీగ - నల్లజీలకఱ్ఱ, మారేడువేరు, వీనిని సరిపాళ్లుగ గూర్చి కషాయము పెట్టి, అష్టభాగావశేషముగ దించుకొని దానిలో సైంధవలవణము, నేయివేసి పొంగించిన యింగువ వీనినికొంచె

ము గికలిపి బాలింతలకు ఇచ్చిన, జ్వరము, వణుకు, తలనొప్పి, భ్రమమాటలాడుట, తాపము, శూల, సన్నిపాతము మొదలగు వానితోగూడిన సూతికారోగము మానును.

మఱియు సూతికారోగములయందు వాతరోగములకు జెప్పిన యౌషధంబుల బ్ర యోగింపదగును.

స్తనరోగములకు—వెఱ్ఱి పుచ్చవేరును జలముతోనూరి కొంచెము వెచ్చచేసి గాని, అడవిప్రత్తివేళ్లు, చేదుసొరవేళ్లు వీనిని గోధుమకడుగుతోనూరిగాని స్తనముల కు పూసిన, స్తనరోగములు మానును.

పాలువృద్ధిబొందుటకు—సొంటి, సుగంధిపాలవేళ్లు, తిప్పతీగె, అగరుసొంటి, చాగవేళ్లు, తుంగముస్తెలు, కొడిశవిత్తులు, దేవదారు, నేలవేము, కటుకరోహిణి వీనిని సరిపాళ్లుగగూర్చి కషాయముపెట్టి బాలింతకు త్రాగించిన స్తనములయందు పాలు వృద్ధిబొందును.

బాలరోగచికిత్స.

తుంగముస్తెలు, పిప్పళ్లు, చిత్రమూలము, కరకపువ్వు, వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి తగినంత తేనెనుకలిపి శిశువులకునాకించిన, అతిసారము, శ్వాసకాసలు వాంతులుమానును.

—చెంగల్వకోష్టు- వస- వాయువిళంగాలు వీనిని నీళ్లలోవేసికాచి యానీటి లో శిశువులకు స్నానముచేయించిన, వ్రణ్లు దద్దులు మొదలగునవి మానును.

—చెంగల్వకోష్టు- కొడిశవిత్తులు- ఆవాలు- పసపు- కరుధూపము వీనినిచూర్ణ ముచేసి దానిలో మజ్జిగకలిపి బాలుర దేహమునకుబూసిన - గజ్జి - దురద - పుండ్లు ఇవిమానును.

—లోహభస్మము- కావిరాయి- రసాంజనము- రక్తచందనము వీనిని సరిపా ళ్లుగగూర్చి తేనెపోసి మదించి శిశువుల నాలుకకురాచిన ముఖపాకరోగము- నోటి పుండ్లు మానును.

—మిరియాలు- పిప్పళ్లు- సన్నయేలకులు- సైంధవలవణము వీనినిచూర్ణముచేసి- తేనె పంచదార వీనికలిపి శిశువులకు నాకించిన- మూత్రకృచ్ఛ్రములు మానును.

ధూపము—ఆవాలు- వేపఆకులు- వెల్లుల్లి- చాగవేళ్లు- పాముకుబుసము- మేక- వెంట్రుకలు- మేకకొమ్ము-వస- వీనిని చూర్ణముచేసి దానిలో తేనెకలిపి బాలురకు ధూ పము వేసిన- ప్రబలజ్వరములు- గ్రహబాధలుతొలగును.

విషలక్షణములు.

వసనాభిమొదలగువాని విషములు స్థావరములనియు - సర్పాదివిషములు జంగ

షములనియు జెప్పంబడును- జ్వరము- వెక్కిళ్లు- వాంతి- అరుచి- శ్వాస- మూర్ఛ-పండ్లు కొరుకుట- నోటనురుగుపడుట ఈలక్షణంబులు స్థావరవిషమువలన గలుగును- దాహము- నిద్ర- కనుకుపాట్లు- అజీర్ణము- అతిసారము- గగుర్పాటు- వాపు- ఈలక్షణములు జంగమ విషమువలన గలుగును.

సర్వవిషములకుచికిత్స—సర్పాక్షి సమూలమును తెచ్చి కషాయముగాచి పుచ్చుకొనిన సకలవిషములుమానును.

—మర్రిపీచలు-పసపు-చిర్రివేరు-కరుధూపము - చెంగల్వకోష్టు-వీనినిసరిపాళ్లగ గూర్చి నూరి ఒకకర్షముచొప్పున నేతిలోగలిపి పుచ్చుకొనిన విషములుమానును.

—చేదుబీరవేళ్లు- నేలతాడిగడ్డలు వీనిరసముదీసి పుచ్చుకొనిన సకలవిషములు మానును.

—సైంధవలవణము- మిరియాలు- వీనినిసరిపాళ్లగ చూర్ణముచేసి- దీనికి సమభాగము వేపవిత్తులచూర్ణమునుకలిపి- కొంచెముగ తేనెను- అధికముగనేతినిచేర్చి కల్వమునందుమర్దించి పుచ్చుకొనిన సకలవిషములు మానును.

—పిలిపీచరున్ను చూర్ణముచేసి దానిలో తగుమాత్రము సైంధవలవణము-నెయ్యి తేనె వీనినికలిపి బాగుగనూరి భక్షించిన- స్థావరవిషములును-దేహముపైనవ్యాపించిన విషములునుమానును.

—చెన్నచర్లగడ్డను జలముచేనూరి నస్యముచేసినను- తుంగముస్తెలు- వెలిగారము వీనినినూరి త్రాగించినను విషములుమానును.

వృశ్చికవిషచికిత్స—ఇంగువనుజలముచేనూరి- లేక జిల్లెడువేరున్ను గంధముదీసిగాని తేలుకుట్టినచోట పట్టువేసిన విషముమానును.

మూషకాదివిషచికిత్స— అగాకరగడ్డను జలముచేనూరి లోపలికి పుచ్చుకొని- కాటుగలచోట గూడరాచిన- ఎలుక- పిల్లి - పాము- తేలు వీని విషములు మానును.

—చెంగల్వకోష్టు- ప్రుంగకాయలు- చేదుబీర- వస వీనిని చూర్ణముచేసి ఆవుపంచితము కలిపి పుచ్చుకొనిన- ఎలుకలుమొదలగు వాని విషంబులుమానును.

—చింతపండు ౧ పల- కరుధూపము ౪ ప- వీనిని పాతనెయ్యిలోనూరినిత్యము ౧ తులమువంతున ౭ దినములు పుచ్చుకొనిన- ఎలుకవిషముమానును-

—మణిశిల- హరితాళకము- చెంగల్వకోష్టు- వీనినిసరిపాళ్లగ గూర్చి వానిని ఆకురసముచే మర్దించి జలమునందు వేసి కొంచెమువెచ్చచేసి పుచ్చుకొనినను- కాటుగలస్థలంబున రాచినను మూషకవిషములు శీఘ్రముగమానును.

—అరతికర్పూరము- పాదరసము- గంధకము - దురిసెనవిత్తులు - కరుధూపము వీనిని సరిపాళ్లుగగూర్చి జిల్లేడుపాలతోనూరి కాటుగలస్థలమునందు రాచిన ఎలుక

తేలు మొదలగు వాని విషములు మానును.

శ్వానవిష చికిత్స — కఱచిన చోట కోడిమలమును గాచిన కుక్కవిషము మానును.

— ఉత్తరేణి వేరును జలముచేనూరి ఒకకర్షమంతచొప్పున తేనెలో కలిపి త్రాగుచు- సైంధవలవణము సన్నకలబంటపట్టి వీనినినూరి కాటుగల స్థలమునందు కట్టుగట్టిన కుక్కకాటుమానును.

వెఱ్ఱికుక్కకాటుకు — నువ్వుపిండి- నువ్వులనూనె- జిల్లేడుపాలు- బెల్లము వీనిని సరిపాళ్లగకలిపి పుచ్చుకొనిన వెఱ్ఱికుక్కవిషము మానును.

## సర్వ విష చికిత్స.

పాదరసము- కొత్తసున్నము- కరుధూపము- వీనిని దినుసుకు రెండుధరణముల యెత్తు చొప్పున గూచిక నల్లయుమ్మెత్తాకురసమున ౮ జాములుమర్దించి దానిలో, నేపాళముల పప్పు ౧౦౦, మిరియాలు ౮౦౦, ఆముదపుపప్పు౮౦, వీనిని నిమ్మపండ్లరసముచే బాగుగమర్దించి, కందిగింజంతమాత్రలుచేసి నీడనెండించి, నీళ్లలోచాది కన్నులకు వేసిన, సర్పవిషములు- గ్రహములు- రేచీకటిమానును.

— చేదుసొరవిత్తులు, త్రిగుడువిత్తులు, చేదుబీరవిత్తులు- దిరిసెనవిత్తులు; వీనిని సరిపాళ్లగనూర్చి ఆవుపంచితముతోనూరి- ఆవుపంచితములోగలిపి పుచ్చుకొనిన సకల సర్పవిషములు మానును.

ధూపము — ప్రత్తివిత్తనములు, యవలపొట్టు, ధనియాలపొట్టు, నెమలిజుట్టు యీకెలు, ఆవుకొమ్ము- నరులవెంట్రుకలు, పాతరాయిపిట్ట మలము వీనినిచేర్చియింటిలో ధూపము వేసిన, సర్పములు పాఱిపోవును- మఱియు దీనిని సర్పములు కఱచిన భాగమున ధూపమునుగాని, పట్టునుగాని వేసిన సర్పవిషములు మానును.

[ పంచగుల్మములకు — ఉత్తరేణి సమూలముగను దెచ్చి భస్మముచేసి-తూమెడు భస్మములో మూడుతూముల నీళ్లుపోసి చిలికిమూడుదినములూరనిచ్చి వడచుకొని-అందులో, సొంటి- పిప్పళ్లు, మిరియాలు, మోడి, నల్లజీలకఱ్ఱ సన్ననాగకేసరములు, ఓమము, కటుకరోహిణి, చెంగల్వకోష్టు- జటామాంసి- అతిమధురము పంచ లవణములు వీనిని దినుసుకు ౧ పలముచొప్పున గూర్చి చూర్ణముచేసి, ఉత్తరేణి నీళ్లలోగలిపి, పొయ్యిమీదపెట్టి అడుగంటకుండునట్లు కలయబెట్టి, పక్వమునకు వచ్చునపుడు, ఇంగువ ౧ పల, ప్రాతబెల్లము ౧ ప, వీనిని నూరికలిపి, బెల్లముకరిగి పక్వమునకు రాగానే దించి చల్లారినపిదప నెల్లికాయంతచొప్పున పుచ్చుకొనిన, పంచగుల్మములు, పంచశూలలు- వాయువులుమానును.

అర్శలకు — మారేడుపండ్లు-కాకిమెరి విత్తులు, సొంటి - వెలగవిత్తులు - పేళ్ళా

ముట్టివేరు- వట్టివేళ్లు- శర్కర-వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి- తేనెలో కలిపియిచ్చిన- ఛర్దులుమానును.

—వస్త్రగాలితపొడి, ఏలకులు పిప్పళ్లు- బారుకులపొడి- చక్కెర వీనినిసమభాగములుగ చూర్ణముచేసి పుచ్చుకొనిన సర్వఛర్దులు మానును.

శ్వాస, పీనసలకు— బలురక్కసిగడ్డ- అల్లము వీనినిచూర్ణముచేసి రెండుమాత్రలయెత్తు చూర్ణమును తేనెలోకలిపి పుచ్చుకొనిన - శ్వాసము - పీనస మొదలగునవి మానును.

రక్తపైత్యాదులకు— చల్లపిల్లిగడ్డలు- సుగంధిపాల - శ్రీగంధము - వట్టివేళ్లు కురువేరు- చిర్రివేళ్లు- దాళిమపండు- ముణుగుదామర వేళ్లు- నల్లకలువపొడ్డ - అతిమధురము- వీనినిసమభాగములుగాగూర్చి కషాయముపెట్టి- ఆవ పాలు మిగులునట్లు చిక్కగకాచి- వడిచి- తేనె చక్కెర వీనినికలుపుకొని పుచ్చుకొనిన- రక్తపైత్యములు- ఆసనమున నెత్తురుపడుట- రక్తప్రదరములుమానును.

ముక్కున నెత్తురుపడుటకు—దానిమ్మపువ్వురసమునుగాని- గరికవేళ్లసునలియగొట్టిగాని నస్యముచేసిన- నాసారక్తముమానును.

రక్తప్రదరములకు—బుడ్డకాకరఆకును- అరటిపండుగుతో నూరి తాగిన-ప్రదర రోగములుమానును.

—గోధుమలు ౧ పల- చక్కెర ౧ పల- జాజికాయ మూడువడ్లయెత్తు- జాపత్రి ౧ తు - వీనినిచూర్ణముచేసి ఆవుపాలతోనూరి పుచ్చుకొనిన - రక్తప్రదరములుమానును.

మేహవ్యాధికి—ఖర్జూరపండు- ఉసిరికెపిత్తులు- పిప్పళ్లు- పటికారము- ఏలకులు- కొండపిండి - అతిమధురము- శ్రీగంధము - దోసవిత్తులు- కొతిమెరవిత్తులు- వీనినిదినుసుకు వరాయెత్తు చొప్పున గూర్చి చూర్ణముచేసి- పెసరకడుగుతోగాని - ఎళనీరుతోగాని పుచ్చుకొనిన- దేహముమంటలు- మూత్రద్వారపుమంటలు- ఆసనముమంట- శుక్లప్రమేహము- శుక్లముపడుట యోనిశూల- ఇవియన్నియుమానును- వీర్యవృద్ధికలుగును.

—తిప్పతీగె చూర్ణమును తేనెతోబుచ్చుకొనిన పసపు మేహముమానును.

నీరుకట్టుకు—సద్యక్షారము ౧ వరాయెత్తు- ఆవువెన్న- గచ్చపలుకులువీనినేకముగానూరి కడిసీళ్లలో కలిపియిచ్చిన నీరుధారాళముగా వెడలును- రాళ్లుఅడ్డ పడిన ను ఊడిపడును.

నెత్తురుబంకకు—ఆరాలు- జీలకర్ర వీనిని కొంచెము వెచ్చచేసి- చూర్ణముచేసి- మంచిబెల్లము- నేయి వీనినివేసి లేహముగ జేసియిచ్చిన-నెత్తురుబంకమానును.

జలోదరమునకు—గాడిదెగడవఆకు ౨ తు- పసపు ౧ తు- లవణము మూడు

యెత్తు మిరియాలు ౧ తు. వీనిని చూర్ణముచేసి మూడువ్రేళ్ల ప్రమాణముతీసికొని తేనెతో పుచ్చుకొని పెరుగన్నము భుజించిన జలదోషము నివర్తించును.

కూతఁగలిగిన మూర్ఛవచ్చుటకు—వెఱ్ఱిచెఱుకు కొనదంటునుకుమ్ములో బెట్టి యుడికించి రసముపిండుకొని ఆరసములో దూదినితడిపి నస్యముచేసిన- మూర్ఛ - చెవిపోట్లు ఇవిమానును.

సోమా కారకముపోవుటకు — చింత చెక్కల భస్మము - చింతపండు వీనిని నీళ్లపోసిపిసికి వడియగట్టి పుచ్చుకొనిన కలకండవలెనుండును కారకము పోయిచలువగలుగును.

నిద్రరానందుకు—జాజికాయ ౧ వరాయెత్తు- జాపత్రి ౧వ విప్పపూలు ౧వ- వీనిలో సగము పచ్చిదిగను సగము వేచినదిగను చేసి చూర్ణముచేసి నేయికలిపిభోజనసమయమందుముందుగ భక్షించిపిమ్మట భుజించవలయు. ఇట్లొనరించిన చక్కగనిద్రవచ్చును.

ఉన్మాదపైత్యమునకు—భూనాగమును నిమ్మపండు పులుసుననూరి యేడుదినములిచ్చిన- ఉన్మాదపైత్యము అనగా రాత్రులు రువ్వుట- పిచ్చిమాటలాడుట మొదలగుగుణములుమానును.

కడుపునొప్పికి—సొంటి ౧ ప - అప్పడాలకారము ౧౺ ప - వీనినిపొడిచేసి- మంచిబెల్లమును పాకముపట్టి అందులో ఆపొడివేసి నెయ్యిపోసి లేహ్యముగాకలిపి రేగుపండంత పుచ్చుకొనిన- కడుపునొప్పిమానును.

దగ్గుఉబ్బసమునకు—వెఱ్ఱిపుచ్చకాయను తొలిచి లోపలిచిత్తులనుతీసి పలిమెడు మిరియాలుపోసి పొయ్యిలోజానెడు గుంటత్రవ్వి- దానిలో ఆకాయనుపూడ్చి ఎనిమిదిదినములుతాళితీసి మూడేసి మిరియాలచొప్పున వేడినీళ్ళతోగాని- మజ్జిగతోగానిపుచ్చుకొనిన- దగ్గు- ఉబ్బసము మానును.

వింశతిమేహములకు — పల్లెరువేళ్ళుతెచ్చి రోటవేసిపిండిగాకొట్టి ఆపిండిని తగినంతతీసికొని ౫ సోలలనీళ్లలో వేసి- సోలెడుగా కాచివడించి- అందులో పిల్లిపీచరవేళ్ళరసము సోలెడు- ఆవుపాలు సోలెడు- ఆవునెయ్యి ౪ సోలెడు- వీనినికలిపి- పాలగుమ్మడిగడ్డ ౧వరాయెత్తు శ్రీగంధము ౧వ - తవాక్షీరి ౧వ - ద్రాక్షపండు ౧వ-అతిమధురము ౧వ - గొట్టెవేళ్లు ౧వ- జోసత్తులు ౧వ - ఏలకులు౧వ- మావెలగచెక్క ౧వ- కలువగడ్డ ౧వ- పద్మవేళ్లు ౧వ- పొన్నగంటివేళ్లు ౧వ- తుంగముస్తెలు౧వ-వీనిని చూర్ణముచేసి పైకషాయములోకలిపి నెయ్యిపోసి పొయ్యిమీదబెట్టి సన్ననిమంటవేసి నేయిమిగులునట్లు కాచి దించి వడియకట్టి నిత్యము గరిటెడు నెయ్యి చొప్పున తేనె- చక్కెరవీనినికలిపి పుచ్చుకొనిన-మూత్రరోగములు ప్రమేహములు మంటలు మొదలగునవిమానును.

ఖర్జూరాదిచూర్ణము — ఖర్జూరపుకాయ - నెల్లిపప్పు - పిప్పళ్లు - కర్పూరము - శిలాజిత్తు - ఏలకులు - ఇప్పపువ్వు - కొండపిండివేళ్లు - ద్రాక్షపండు - మంచిగంధము - అతిమధురము - వట్టివేరు - భూచక్రగడ్డ - దోసవిత్తులు - పెద్దగుమ్మడివిత్తులు - చల్లపిల్లిగడ్డలు - కొత్తిమెరవిత్తులు - లవంగాలు - వీనిని సమభాగములుగాగూర్చి చూర్ణముచేసి - చూర్ణమునకు సమముగ పంచదారను కలిపి ప్రొద్దుటిపూట మూడువేళ్లకు వచ్చినంత పసికదుగులో పుచ్చుకొనిన - మూత్రకృచ్ఛ్రములు - వాంతి - శర్కరామేహము - మంటలు - అలమంటలు - కండ్లుమంటలు - అరకాళ్లు అరచేతులమంటలు - అరోచకము - నాలికపొక్కుట ఇవియన్నియు మానును. వీర్యవృద్ధి కలుగును - సంతానములేనివారికి సంతానము కలుగును.

సర్వపైత్యములకును దాడిమాదిచూర్ణము — దాడిమపండు - వరిపేలాలు - తెల్లకలువగడ్డలు - అతిమధురము - ఖర్జూరపుపండు - సుగంధిపాలవేరు - తవాక్షీరి - కురువేరు - నెల్లిపప్పు - తుంగముస్తెలు - మంచిగంధము - గ్రంథితగరము - తక్కోలములు - జాజికాయ - లవంగాలు - లవంగపత్రి, నాగకేసరాలు - ఏలకులు - దనియాలు - పిప్పళ్లు - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి - చూర్ణమునకు సమముగ శర్కరగలిపి - ప్రొద్దుటిపూట - మూడువ్రేళ్లకువచ్చినంత చూర్ణమును చన్నీళ్లతోగాని - ఆవుపాలతోగాని పుచ్చుకొనిన - నలువది పైత్యములుమానును. పాండువు - కామిల - జ్వరము - అరోచకము - క్షయము - ప్రమేహము ఇవియన్నియుమానును.

శిశువుల ఉబ్బసమునకు — లవంగము - పిప్పళ్లు - జాజికాయ - జాపత్రి - చక్కెర పెద్దగుమ్మడికాయరసము - వీని నేకముచేసి ఆవునేతితో నాకించిన - పసిబిడ్డలయుబ్బసములుమానును-

శిశువులకుగలిగెడి పక్షిదోషమునకు — నూనెగిద్దెడు - ఆవునెయ్యి ౧ గి - అప్పుడువడిసిన ఆముదము ౧ గి - చిర్రివేళ్లరసము ౧ గి - గుమ్మడిపువ్వులు ౮ వీనిని ఒకటిగాకలిపి దీపాగ్నిచే మాడకుండావండి - దించిదానిలోగిద్దెడుతేనెనుకలిపి బాలురకు ప్రొద్దుటిపూటయిచ్చిన - పక్షిదోషము - ముట్టుదోషము తొలగును.

ఆర్తవములేని స్త్రీలకుచికిత్స — దాడిమపండు - నువ్వులు - బెల్లము - గంటుభారంగి - చిత్రమూలము వీనిని సరిపాళ్లుగగూర్చి నువ్వులకషాయములోగలుపుకొని పుచ్చుకొనిన - ముట్టులేనివారికి ముట్టుకలుగును.

—తప్పెడు ఉలవలను పడిసెళ్లలోబోసి కాచి దించి ౧ ఆళాకులో ౨ వరాలయెత్తు చిత్రమూలమును నూరి కలిపి - ఆకషాయమునిచ్చిన - ౧, ౨ దినములలో దూరస్త్రీయగును - గర్భముకూడనిలుచును - చద్దిఅన్నముకూడదు.

ముట్టుకట్టుకు — గారపండ్లు - గారవేళ్లు - ఈశ్వరివేరు వీనినిచూర్ణముచేసి - బెల్లము వేసి త్రొక్కి - గుటికలుచేసి ఋతువైన మూడుదినములు పుచ్చుకొనవలయు. ఇట్లు నాలుగుసార్లు సేవించిన ముట్టుకట్టుమానును.

దగ్గులకు—నేలములకను సమూలముగ దెచ్చి రోటవేసి త్రొక్కి రసము పిండి సోలెడు తీసివడియగట్టి- దానిలో- పదిమిరియాలను చూర్ణము చేసి వేసి- వెల్లుల్లిగడ్డలను నూరి కలిపి పొయ్యిమీద బెట్టి- ఒకపొంగురానిచ్చి దించి చక్కెరగలిపి- సోలెడుచొప్పున మూడుపూటల్లు పుచ్చుకొనిన సకలవిధములైన దగ్గులుమానును- మిరియపు చారు అన్నము పథ్యము.

✓—ఊడుగచెట్టు దగ్గరకుపోయి దానికి ప్రదక్షిణ నమస్కారము లొనర్చి మూడుకొనలను తీసికొని- యీ ప్రకారము పదిదినములు- దినమునకొకటిచొప్పున తెచ్చి చితిసికొని భక్షించుచుండవలయు. అట్లుతినుటకశక్యంబైనయెడ దానిని నూరి ముద్దచేసి మ్రింగవలయు. పదిదినములకు -దగ్గుతబ్బసములుమానును. ఒకమండలము పుచ్చుకొనిన దివ్యదేహముగును- రోగములుమానును- కరచినపాముచచ్చును.

వాంతులకు, భేదులకును—౧౦ వరాయెత్తు మిరియాలను తెల్లగుడ్డలో మూటగట్టి కాల్చి భస్మముచేసి- యీభస్మమును వేడినీళ్ళతో ఇచ్చిన- వాంతులు భేదులుమానును.

తేలువిషమునకు— టెంకాయచిప్పలో జిల్లేడుపాలుపోసి సైంధవలవణము వేసి నానవిచ్చి నూరి కోపులుచేసి- కలిలో చాది కుట్టినచోటరాచిన విషము దిగును.

గర్భము నిలుచుటకు—ఋతువైనవాడు- నాగకేసరాలపొడిని ఆవునేతితో పుచ్చుకొనిన గర్భమునిలుచును. తక్కలిఆకును మూడుదినములు పుచ్చుకొనినను సాంబ్రాణి ఆకుపసరు- మిరియపుపొడి - నూనె వీనినికలిపి పుచ్చుకొనినను-గంటుపురుగు చచ్చి గర్భమునిలుచును-

—తగిరిశవిత్తులు- కరక్కాయలు- వరిబియ్యము-వీనినిసమాంశములుగ కూర్చి చూర్ణముచేసి పలికడుగుతోనిచ్చిన- గొడ్డురాలుకు గర్భమునిలుచును.

గర్భస్రావములకు—మాడయెత్తు జాజికాయను మేకపాలతో మెత్తగనూరి యీపాలతోగూడ త్రాగించిన గర్భస్రావములుమానును.

ఆడుశిశువుజనించుటకు—వేలెడుపసపుకొమ్మును సన్నగపొడిచేసి- మూడువెల్లుల్లిగడ్డలను మెత్తగనూరి- నిడుపుకాకరాకు కొనలనుకూడతెచ్చినూరి వీనినన్నిటిని కలిపి- ముట్టుఅయిన మూడుదినములుఇచ్చిన- ఆడుశిశువుకలుగును- పెసలగంజి పాలు అన్నము పథ్యము.

మొగశిశువుకలుగుటకు—పుత్రజీవివిత్తులను- లోపలిపప్పునలగకుండునట్లు పగలకొట్టియాగింజలనుమూటినిఆవుపాలతో నొకదినము పుచ్చుకొనిన మొగశిశువుకలుగును

గర్భిణీశూలకు—మారేడుఆకును ఉప్పును వేయించి - సమముగకలిపి వేడినీళ్లతో నొసంగిన - గర్భశూలలు మానును.

శిశువుల అతిసారములకు జ్వరములకును—పట్టివేళ్లు-నేరేడుచిగుళ్లు - మామిడి

చిగుళ్లు- మ్రొక్కోనలు- వీనినిదినమునకు ౧ వరాయెత్తుచొప్పున గూరించియెండించి యిని మిది గిద్దలనీళ్లుపోసి గిద్దెడుగా కాచి వడియగట్టి తేనెతో శిశువులకులోపలికిచ్చిన- జ్వరము- అతిసారము- కక్కుట- మూర్ఛబడలిక ఇవిమానును.

జిహ్వావిరేచనము—రసము- గంధకము- నేపాళములు- వెలిగారము - చిట్టాముదపువేరు - అడవి ఆముదపువిత్తులు- నెల్లివేరు- కరక్కాయ- తానికాయ - మాచకవిత్తులు- తంగేడువేరు వీనినిసమభాగములుగ గూరించి చూర్ణముచేసి జాంతి జెముడుపాలుపోసి మూడుదినములు నూరి పాత టెంకాయ చిప్పలోబెట్టి యెండలోపెట్టిన- తైలముదిగును- ఆతైలమును సూఫుగింజంతతీసికొని నాలికెమీద చరిమిన యెడల పదిమార్లు భేదియగును. పిదపస్నానముచేసి మజ్జిగఅన్నమును భుజింపవలయు.

పాదవిరేచనము—పచ్చినేపాళములను ఆవుపాలతో నూరి ఆవుపాలలో కలిపి తోడుపెట్టి- మరునాడుచిలికి వెన్నదీసికొని- ఆవెన్నను అరికాళ్లకు చరుముకొని పాదములు భూమినంటకుండునట్లు పావుకోళ్లు వేసికొని తిరిగిన- విరేచనము లగును.

నేపాళములనుభేదికిచ్చువిధము— నేపాళపుగింజలను వొలిచి పేడలో కలిపి ఉడకబెట్టి- పప్పుతిత్తియెండించి లోపలినాలికెలు తీసివేసి- ఆవుపేడగలిపి వాసెనగట్టి- అగుష్టమీద - నేపాళపు పప్పును పోసినెరపి పైనపెద్దచట్టనిమూసి - జాముసేపు మంటవేసి ఆరనిచ్చి తీసి నీడనారబెట్టి- సున్నపునీళ్లు చింతాకురసము- గుంటగలగరాకురసము- కలుబందరసము- కాడినీళ్లు- ఆవుపెరుగు- టెంకాయనీళ్లు- ఎఱ్ఱవుల్లిగడ్డలరసము- తాటిబెల్లము వీనితోప్రత్యేకముగశుద్ధిచేసి- మంచినీళ్లతోగడిగి- నీడనారనిచ్చి యాపప్పును నేతిలోవేయించి - దానిని నమిలిమ్రింగిన మంతమామిడిపప్పువలె నుండును గొంతున ఆసనమున మండదు. తాంబూలము వేసికొని- ఒకపప్పులో కాలుభాగమును వేసికొని నమిలిరసమునుమ్రింగి తమ్మనమియవలయు - ఎనిమిదిసార్లు విరేచనమగును-

రాజయోగ్యవిరేచనమునకు—ఆముదము ౧½ ప - తేనె ౧½ ప - ఈరెంటిని కలిపిత్రాగిన భేదియగును- భేదఅధికమైనయెడ పెరుగన్నమును భక్షించవలయు.

—కుప్పింటాకును నేయిబోసివాడ్చి నమిలి మ్రింగిన పదిమార్లుభేదఅగును.

ఇచ్ఛాభేదికి—రసము ౧పాలు- గంధకము ౨పాలు- మిరియాలు౩పా- పొంగించిన వెలిగారము ౪పా- సొంటి ౫ పా- కరక్కాయ ౬పా- వీనికన్నిటికి సమముగా నేపాళములు- వీనికిసమానము బెల్లము ఈప్రకారము వీనినన్నిటిని జేర్చి కల్వమున నూరి కామ్ముబరిణెలోనునిచికొని- నాలుగుమిరపగింజలంతచొప్పున- దేహమానమునకు దగినట్లుగా- వేడినీళ్లలో గలిపియిచ్చిన- పదిమార్లు భేదియగును- దీనివలన- కామీకటి- గుల్మములు- శోభలు- శూలలు- మహోదరాలు- పైత్యభ్రమలు, తీట- పాండురోగములు-

మేహములు- సర్వవిషములుమానును. రాత్రిభోజనము సాయంకాలమేచేసి- రాత్రిపూట సొంటి మిరియాలను కషాయముపెట్టి పుచ్చుకొనవలయు.

ఉసిరికకాయలభేదిక్రమము—నేపాళములు ౧ పల - సైంధవలవణము ౧౦ ప- టెంకాయ ౧- దెబ్బతగులనియుసిరికకాయలు ౧ పడి- వీనినితెచ్చి- సైంధవలవణమును నీళ్ళలోవేసికలిపి అందులో యుసిరికకాయలనువేసి - నీరిగురునట్లు ఉడకబెట్టి దించి- టెంకాయనుతురిమి పాలుపిండుకొని- ఆపాలలో నేపాళములను నూరికలిపి బాగుగ కాగనిచ్చి- చమురిగురు సమయమున ఆకాయలను ఇందులోవేసి - వానికిఆ చమురు బాగుగపట్టియిగిరిన తరువాత దించి జాడీలోవేసిపెట్టుకొని ప్రొద్దుటిపూట నొకకాయనుభక్షించిన- ఆయాసములేక పదిమార్లుభేదియగును. పిదపస్నానముచేసి చక్కగభుజింపవచ్చును.

తీవ్రముగభేదియగుటకు—శుద్ధిచేయబడిన నేపాళములు. సైంధవలవణము వీనిని సమభాగములుగగూర్చి- నీళ్ళలోనూరి తేనెలోకలిపి తైలపక్వమున కాచి వడియగట్టి యాఘృతమును సీసాలోనునిచికొని- వేడినీళ్ళలోనాలుగుబొట్లు విడిచిపుచ్చుకొనిన తీవ్రముగ భేదియగును. కడుపునొప్పి తత్క్షణమునహరించును.

అన్నముసహించక వాంతియగుటకు—పత్తివిత్తులపప్పునువేయించి పొడిచేసి పెట్టుకొని- వడ్లబారుగులు. పిప్పళ్లు- జీలకర్ర- ఈమూడుదినుసులనుపొడిచేసి రెంటిని చేర్చి చక్కెర తేనె వీనినికలిపియిచ్చిన అన్నముచక్కగ హితవగును.

మూలవ్యాధికి—గంజాయిపొడి- సొండి- గజపిప్పళ్లు- జటామాంసి- దాళిషపంము- ఓమము- యవక్షారము- ఇందుప్పు- ముళ్ళివేరు- ములకవేరు వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి వేడినీళ్ళతో ఇచ్చిన - మూలము - ప్రమేహము - నీరుకట్టు- మూత్రద్వారమున రాళ్లుతగులుకొనుట- అండవాయువు- పాండురోగము- ఇవియన్నియుమానును.

—అరటిగడ్డనుతెచ్చి మూడుభాగములుగాకోసి మూడురాత్రిళ్లు మంచులోనునిచిప్రొద్దుటిపూటదంచి రసముతీసి వడియగట్టి - కలుబంద ౹వరాలెత్తు కొంచెముగ జీలకర్ర వీనినివేసి మూడురోజులుత్రాగిన- లోమూలము - వెలిమూలము రక్తమూలము మొలలు మానును-

చక్షువతైలము—మిరియాలు ౧ పల- అతిమధురము | ప - తుంగగడ్డలు ౧ ప- ఉసిరికపప్పు ౧ప- పెద్దలవంగపట్ట ౧ ప- శ్రీగంధపుచెక్క | ప- వట్టివేరు ౪ప - కురువేరుపచ్చాకుఇవి ౪పల- కస్తూరిపసపు ౧ ప- కిచ్చిలిగడ్డ | ప- సోపు ౧ ప- వాయువిడంగాలు ౧ ప, మంజిష్ఠి ౧ ప- కుంకుమపువ్వు ౪ వరాయెత్తు- గోరోచనము ౧ ప- పచ్చకర్పూరము ౧ప- నూనె ౧పడి వీనినిచేర్చి తైలపక్వముగాకాచి వడియగట్టి-త

టుగాని స్నానము చేసిన- కారకములునశించి దేహము చల్లబడును.

దాడిమాదిచూర్ణము—ద్రాక్షపండు- ఖర్జూరపుకాయలు కలువగడ్డలు-అతిమధురము- తక్కోలములు- సుగంధిపాల- వట్టివేరు- కురువేరు- గంధపుచెక్క-లవంగపట్ట- ఏలకులు- లవంగిపత్రి- నాగకేసరాలు- తవాక్షీరి- ఉశిరికపప్పు- తుంగగడ్డలు - నేలయుసిరిక- భూచక్రగడ్డ- జాజికాయ- లవంగాలు- పిప్పళ్లు-ధనియాలు- వరిపేలాలు- కర్పూరశిలాజిత్తు వీనినిసమభాగములుగా గూర్చి చూర్ణముచేసి దీనికిసమముగచక్కెరనుగలిపి ప్రాతఃకాలమందు ఆవుపాలతో పుచ్చుకొనిన- అరోచకములు- మేహకారకములు, కండ్లు- కాళ్లు- చేతులు వీనియందలిమంటలు ఇవియన్నియుమానును - అగ్నిదీపనము కలుగును- అవనానె గుమ్మడి ఇవికూడవు.

అండవాయువులకు—జిల్లేడుపువ్వులను తెచ్చి దోరగిలవేయించి- జీలకర్రను కొంచెము వెచ్చచేసి- ఆపువ్వులను- జీలకర్రను కాచువక్కలను ఒకటిగాకలిపి కషాయము పెట్టియిచ్చిన అండవాయువులుమానును- తోటకూర-కందిపప్పు -పెసలపప్పు నేయి- ఇవి పథ్యము.

శిరోవాయువులకు— మేకపాలు- ఆవునెయ్యి- చిట్టాముదము - మంచినూనె- చేమబీరాకురసము - గుంటగలగరరసము- ఇవి సమభాగములు చేర్చి ప్రొయ్యిమీదబెట్టి తైలపక్వముగునప్పుడు-లవంగపట్ట-లవంగపత్రి-నాగకేసరాలు- ఏలకులు- శ్రీగంధము- రక్తచందనము - మంజిష్టి- వీనిని దినుసుకు ౧౪ వరాలయెత్తు చొప్పనగూర్చి చూర్ణము చేసివేసి దించివడియగట్టి- సీసాలోనునిచికొని తలయంటుకొనుచువచ్చిన- శిరోవాతము వలని నొప్పులు- పార్శ్వపుదనొప్పి- కపాలశూలయిమానును.

చెవులోచీముకారుటకు—రసకర్పూరమును కొంచెపుమంచినూనెలోవేసివక్కవాగకాచి చెవిలోపోసిన చీముకారుట మానును.

కర్ణశూలలకు—వేలిపొడపుగలసొంటిని నూనెలోముంచి దీపమున వెలిగించి అదిమండునపుడు- ఒకపాత్రములో అరపలమునూనెనునిచికొని గరిటెతో- మండుచున్న సొంటిమీద కొంచెముకొంచెముగా పలుమారు వేయుచుండిన - కొమ్ముచుండి బొట్లుగా తైలమువిగును. దానిని చెవిలోపోసిన చెవిపోట్లుమానును, మఱియు-మేహవాయువు నొప్పులుగలచోట మర్దించిన నవిగుణమగును.

నేత్రరోగములకు- చెవుడునకును— గుంటగలగరాకు రసము ౨ అణ్గకలయెత్తు కలబందరసము ౩ అ- ఆవునెయ్యి ౨ అ- ఆవుపాలు ౩ అ -వీనినన్నిటిని కలయబోసి- ౧౦ వరాలయెత్తు అతిమధురమును మెత్తగానూరి వానిలోకలిపిఘృతపక్వముగదించి వడియగట్టి అభ్యంగము చేయుచువచ్చిన- కంఠరోగములు- చెవుడుమానును.

చెవుడునకు—పచ్చసుగంధిపాలవేరుపట్ట ౹పల- అతిమధురము ౹ప- వీనిని ఆవు

పాలతోనూరి నూనెలోవేసికాచి తైలపక్వమునకువచ్చిన తెరువాత దించి వడియగట్టి- తలకుఅంటుకొని స్నానము చేయుచుండిన చెవుడుమానును.

—చేదుబీరాకురసము- ఉసిరికకాయలరసము- కన్యాకుమారిగడ్డ- ఆవవిమినుములు- గంజాయియాకు - దొండవేళ్లు- అడ్డసరవేళ్లు- వావిలివేళ్లు. పొన్నగంటివేళ్లు- కాకరవేళ్లు-వీనిని సమభాగములుగ గూర్చి కషాయముపెట్టి ౧ వశాలుమిగులునట్లు కషాయముకాచిదించి మంచినూనె- ఆముదము- ఆవునెయ్యి - ఈమూటిని కషాయమునకు సమభాగముగావేసి, అంతమాత్రము మేకపాలనుపోసి- సొంటి- పిప్పలి మిరియాలు- కరకతాడి- ఉసిరికవరుగు- ఏలకులు- లవంగపట్ట- లవంగపత్రి-చెంగల్వకోష్టు- వాయువిళంగాలు- మునగవిత్తులు- అక్కలకర్ర - సైంధవలవణము - వీనినిదినుసుకు ౧ వరాయెత్తు చొప్పునగూర్చి మేకపాలతోనూరి పైకషాయములోగలిపి తైలపక్వమునదించి వడియగట్టి నాలుగుదినముల కొకసారి అభ్యంగముచేసి కొనుచుండిన- నేత్రశూలలు- తలనొప్పులు- శిరోవాయువులు- చెవుడు- చెవిపోట్లు- పీనస - శిరస్సునబుట్టెడి సకల రోగములునుమానును.

మేహకారకమునకుతైలము— వల్లారిఆకు పసరు ౧ ఆశాకు- తిప్పతీగెరసము- ౧ అ- చెంగల్వకోష్టు ౪ ప- అతిమధురము ౪ ప- ఏలకులు ౪ ప- ధనియాలు ౪ ప- మంచినూనె ౧౪ అ- ఆముదం ౧౪ అ- నెయ్యి ౧౪- ఆవుపాలు ౮౪ అ - వీనినన్నిటిని ఒకటిగా జేర్చి మృద్వగ్నిచే వండి - తైలపక్వమున దించి వడియగట్టి - తలకు మాత్రము అంటుకొని స్నానముచేయుచువచ్చిన మేహకారకము మానును.

చలవఆముదము—ఆముదము ౧పడి- ఉసిరికకాయలరసము ౧పడి-ఒలిచిన తెల్లపాయలు ౧౦ ప- సన్నగతరిగిన ఎఱ్ఱగడ్డలు ౧౦పల- వీనినేకముచేసి కాచి తైలపక్వమునదించి వడియగట్టి- ప్రాతకు అరపలముచొప్పున యిచ్చిన మూడుసార్లు భేదియగును - ఈయాముదము శరీరమునందిమిడి- కండ్లు కాళ్లు చేతులు దేహమువీని[illegible]లి మంటలు- తెల్లముచ్చలు- మేహకారము ఇవియన్నియు మాని దేహమునకు పుష్టినిచ్చును - అగ్నిదీపనముకలుగును.

—౧ వీసె కొత్తిమెర్లను, వార్చినగంజిలోపోసి నాననిచ్చి తీసి ఆరపెట్టి,తిరిగి గంజిలో వేసి నానబెట్టితీసి యీప్రకారము మూడుమార్లుచేసి ఆరనిచ్చి పిదపవానినిరోటదంచి చూర్ణముచేసి వస్త్రగాలితముచేసి, ప్రాతకు తులమెత్తు చొప్పున పుచ్చుకొని మంచినీళ్లను త్రిమింగవలయు. ఇట్లు ఇరువదిదినములు రేపుమాపు పుచ్చుకొనిన, వెంట్రుకలు నల్లనై మొలచును - ఈచూర్ణమునునిమ్మపండ్లపులుసుతో ౨౦దినములుపుచ్చుకొనిన- చిక్కినశరీరములకు పుష్టికలుగును- మఱియు- తలదిరుగుట, బొమ్మలాకమ్మట, అసిగతమలైనకారకములు, నోటనీళ్లువచ్చుట ఇవియన్నియుమానును.

తలనొప్పి తైలము — సోమిందాకు- జిల్లేడాకు- ఆవదొండాకు, వావిలాకు- నుష్టుశాకు- వెర్రిబీరాకు- మేకమూత్రము, పచ్చిబలరక్కిసిగడ్డ- పచ్చిదుంపరాష్ట్రము- పచ్చిపసపు- ఊదినసులరసము ౧ తవ్వెడు- చెన్యము, చిత్రమూలము- పలుకు సాంబ్రాణి- మిరియాలు- ఓమము- వస- కస్తూరిపసపు- మావిలింగపట్టు- మునగపట్టు-నల్లతుమ్మపట్టు- వీనినిసగము కషాయముగను- సగము చూర్ణమునుచేసి వేసి - మంచినూనె- కొంకాయనూనె- వేపనూనె వీనిని తగుమాత్రముపోసి- అన్నిటినికలిపి తైలపక్వముగ నదించి వడియగట్టి తలకుఅంటుకొనుచుండిన తలనొప్పులు- తలపోట్లు- తలదిమ్ములు- స్త్రీలసూతికా వాయుసంబంధమగు తైంజలుబు ఒళ్లునొప్పులు మొదలైనవి మానును.

వాసనతైలము — ౧ వీసె గరికెవేళ్లను కషాయముపెట్టి ౪ వంతులు మిగులునట్టు కాచి వడియగట్టి మంచినూనె ౨ పల్లు- పైకషాయమును ౧ సేరు- వీనినికలియబోసి కాచి-లవంగపట్ట- కురువేరు- వట్టివేరు వీనిని దినుసుకు ౧ పలముసంతున గూటిచి చూర్ణముచేసివేసి తైలపక్వముగ దించివడియగట్టి- తలకు అంటుకొనుచువచ్చినకండ్లకు చలువగలుగును.

—శ్రీగంధపుచెక్క, కారుబోగవిత్తులు, కిచ్చిలిగడ్డ సుగంధపాలవేళ్లు, బిల్వాపం ముగుజ్జు, పొగడపువ్వులు- లంజసవరము, గాదంగిరేకులు, కురువేరు, వట్టివేరు వీనిని సమభాగములుగ గూటిచి మంచినూనెలో వేసి వాసెనగట్టి, ఎండపుటమున ౮ దినములునిచి తరువాత వడియగట్టి, బుడ్డిలోబోసి యుంచుకొని, స్త్రీలు తలయంటికొని స్నానముచేసిరేని వెండ్రుకలు మొలిచి కోమలముగ వృద్ధిజెందివాసనగలిగియుండును

రోమనాశనమునకు — ఉసిరికెత్తులను-గంగరేణపత్తులను సీర్చచేనూరిపూసినను. హరిదళము- సంపంగినూనె వీనినినూరి- రోమములయందు చెమటగలిగి యుండునపుడు పూసినను వెండ్రుకలన్నియురాలి మొలవకయుండును.

దూరదృష్టికి — పిప్పళ్లు 3, మిరియాలు ౫, కరక్కాయలోనిపప్పు ౧౨, వీనిని ఉసిరికకాయలరసముచే మర్దించి మాత్రలుచేసి నీడనెండించి, చనుబాలలో రాచి కంటికివేసిన, ఒకమండలములో దూరదృష్టి బాగుగకలుగును.

నేత్రాంజనము — గుంటగలగర, పొన్నగంటి, తమలపాకు, కర్పూరవల్లి, కృష్ణతులసి, రామతులసి, భూతులసి, హంసపాది ఆకు, వల్లారి ఆకు, సాంబ్రాణిఆకు, నల్లేరు, అగిసియాకు, నాగుదోసాకు, పల్లేరాకు, వసఆకు, అల్లపుఆకు, పసుపుఆకు. కాకరాకు, తురకవేపాకు, వెర్రిచెరుకాకు, నందివర్ధనపాకు, మారేడుఆకు, ఉత్తరేణిఆకు, ఆరెకూర, కుప్పెంటాకు, మునగాకు వీనిపసరులను సమాంశములుగాదీసి రాగిచట్టిలోబోసి, గుడ్డగట్టి నీడను ఆరనిచ్చి, అందులోవెన్నకలిపి కన్నులకువేసినసమస్తనేత్రరోగములుమానును.

కంఠనాదముకలుగుటకు— జీలకఱ్ఱ, లవంగాలు, పిప్పళ్లు, తాళిసపత్రి, చిల్లగింజలు, దేవదారుచెక్క, అతిమధురము, వీనిని సమాంశములుగ గూర్చి వేయించి, పొడిచేసి, పూటకుపావెత్తుచొప్పున తేనెతోబుచ్చుకొనిన, కఫముహరించి కంఠమునకు మంచినాదముగలుగును, కాకమీదిదగ్గులు మానును.

— సరస్వతిఆకు, బోడతరము, వస, సొంటి, పిప్పళ్లు. వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి పూటకు కర్షమెత్తుచొప్పున తేనెతో ౪౦ దినములుపుచ్చుకొనిన వాక్కునకు స్ఫుటత్వంబును, కంఠమునకు నాదంబునుగలుగును.

నస్త్రికంఠనాదమునకును— వస ౨ పల- పిప్పళ్లు ౨ప- సొంటి ౧ ప, జీలకఱ్ఱ అరప, ఏలకులు అరప, లవంగాలు ౧ ప, జాజికాయ ౨ప, బోడతరము ౧౦ ప, వల్లారాకు ౧౨ ప, వీనినినీడను ఆరనిచ్చి చూర్ణముచేసి, చక్కెర ౧౦ప, తేనె ౧౪ప, వీనిని ఆచూర్ణములోపోసి సిసికి లేహ్యపక్వముగాచేసి, రేపు మాపుపూటకంత పుచ్చుకొనుచుండిన నస్త్రి, అపస్వరము మాని, మంచిజ్ఞానము, కంఠమునకు కోకిల స్వరమువంటి స్వరముకలుగును.

పండ్లనొప్పికి— పిప్పళ్లు- ఓమము- లవంగాలు- ఉప్పు, కరక్కాయలు, మోడి వీనిని సమభాగములుగాగూర్చి జిల్లేడుపాలుపోసి బాగుగతడిపి- చట్టిలోపెట్టి-నిప్పుసెగయందునిచి ఆపొడితో పండ్లుతోమికొనిన పండ్లనొప్పులుమానును,

— బాదముకాయచిప్పలు ౨౦ తెచ్చికాల్చి పటికెను పచ్చిదిగానే పొడిచేసి రెంటినికలిపి- దీనితో ప్రతిదినము పండ్లుతోమికొనిన, పండ్లనొప్పి - సందులలో నెత్తురుకారుట- కదులుట ఇవియన్నియు మానును.

చిగురువాచినందుకు— కంది ఆకునైనను వెల్లుల్లిగడ్డనైనను, జిల్లేడుపాలచె దడిపిన దూదినైనను - ఆదూదినడుమ ఇంగువనునిచిగాని - పంటిమీద అద్దిన రెండుగడియలకునొప్పితీసును.

— సెనగలు ౨ ఆకాకులు- గోధుమలు ౧౪ అ- వీనిని- వెచ్చచేసి - మైలుతుత్తము ౧ప- పోస్తుకాయ ౧ప- వీనినన్నిటిని గూర్చి పొడిచేసి మత్తులో నునిచికొని ఆపొడితో నిత్యముపండ్లుతోముకొనిన- ఎట్టినొప్పులైనను మానును.

పీనసకు— పండుజిల్లేడాకుపసరు, మంచినూనె వీనిని సమభాగములుగ గూర్చికాచి, దించబోవునప్పుడు, కొంచెముగోరోచనము, కుంకుమపువ్వు వీనినివేసి తైలపక్వమున దించి వడియగట్టి, తలయంటికొని వేడినీళ్ళతోస్నానముచేసిన, ముక్కులు అడుచుకొనుట- ముక్కులనీళ్లుగారుట తలబరువుగానుండుట - తుమ్ములు- పీనస ఇవియన్నియుమానును.

— సీమఉల్లిగడ్డలను నలియగొట్టి గుడ్డలోజెట్టి ముక్కునస్యముచేసిన- పీనస

తేనె వీనినిసమ్మ పండ్లపులుసు నమదించి నాలుకకురాచిన- వాంతులు నిలుచును.

— దొండాకుపసరు నోసంగినవాంతులు మానును.

—తీగె బచ్చలి ఆకురసము- జీలకఱ్ఱ వీనినికలిపియిచ్చినవాంతులు మానును.

—సొంటి- పిప్పలి- కరియాలు- ఇవి 3 వరాలయెత్తు- మోడి ౧ వ- శ్రీగంధము 3వ వీనినికషాయముపెట్టి- వడియగట్టి అందులో జీలకఱ్ఱనునూరి కలిపి పుచ్చుకొనిన నెట్టివాంతులైనను మానును.

## ద్రవ్యశుద్ధులు.

పాదరసశుద్ధి—దీనినికల్వమునవేసి కలబందరసము - పసపుపొడి - ఇటికపొడి వీనిచే ప్రత్యేకముగ నొక్కొకదినము మదించి కడిగిన శుద్ధమగును.

—ఇంగిలీకములో రసముతీయువిధము—ఇంగిలీకమును వేపవేరుచక్కరసముతోగాని నిమ్మపండ్లరసముతోగాని జాముసేపు మదించి డమరుకయంత్రములో నుంచిక్రిందమంటవేసిన రసముపైకుండకువ్యాపించును- ఆరసమును ఔషధములయందుపయోగించుకొనవచ్చును.

గంధకశుద్ధి—కుండకుసగమువరకు పాలుపోసి దానికితగలకుండ వ్రేలునటులకుండ మూతికినొకవస్త్రమునుగట్టి దానిపైన నెల్లిగాయగంధకమునువేసి మూకుడునుమూసి చీలమన్నుపోసి ఆకుండనుగొంతువరకు పల్లములోపూడ్చి పుటమువేసిన గంధకము శుద్ధమగును.

ఇంగిలీకశుద్ధి—ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో - ఒకదినముమదించిన శుద్ధమగును.

తాళకశుద్ధి— దీనినిసన్ననిరేకులుగ కత్తిరించి రెండుమూడు మడతలుగలగుడ్డలోమూటగట్టిఒక కుండలో అవుపంచితము-కలి-పోసి-వీనిచేతను-బూడిదగుమ్మడు రసముచేతను- నువ్వులనూనెచేతను, త్రిఫలకషాయముచేతను - ప్రత్యేకముగ నొక్కొకజాము డోలాయంత్రమున వండినశుద్ధమగును.

మణిశిలశుద్ధి—దీనిని రెండుమడతలుగల సన్ననిబట్టలోమూటగట్టి మేకపంచితముతోగాని - గుంటగలగరాకు రసముతోగాని డోలాయంత్రమున నొక్కదినము వండిన శుద్ధియగును.

గౌరీపాషాణశుద్ధి— దీనిని నిమ్మపండురసమున మదించిదానిని మడతగుడ్డలో మూటగట్టి సున్నపునీళ్లలో డోలాయంత్రముచే అరదినమువండిన శుద్ధమగును.

ఉల్లిపాషాణశుద్ధి—దీనినిపొడిచేసిపైదానివలెనేఒకదినమువండిన శుద్ధమగును.

దొడ్డిపాషాణశుద్ధి—దీనినిపొడిచేసి పైదానివలెనేచేసి- ఆవుపంచితములో డోలాయంత్రమున మూడుదినములువండిన శుద్ధమగును.

హేమమాక్షికశుద్ధి—దీనిని ఎఱ్ఱగ కాల్చి నిమ్మపండురసములో నెఱ్ఱగనగువరకు ముంచుచుండిన శుద్ధమగును.

వెలిగారము మొదలగువానిశుద్ధి—వెలిగారము, శంఖము, గవ్వలు, కావిరాయి, అన్నభేది, భూనాగము, సౌవీరాంజనము, పుష్పాంజనము, నీలాంజనము, స్రోతోంజనము, రసాంజనము వీనిని నిమ్మపండ్లపులుసున నాననిచ్చి యొకదినము ఎండలో నునిచిన పరిశుద్ధములగును.

శిలాజిత్తుశుద్ధి— దీనిని ఆవుపాలు, కరకతాడి యుసిరికలకషాయము, గుంటగలగరాకురసము, వీనిచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి యెండలో నెండించిన శుద్ధియగును.

కంపిల్లశుద్ధి— కంపిల్లమును పొడిచేసి గుడ్డను మూటగట్టి, కరక్కాయలరసముతోనైనను, కలితోనైనను, డోలాయంత్రమున నుడికించిన శుద్ధియగును.

బోరశుద్ధి—దీనిని కలితో మర్దించి జాముసేపు ఎండలోనునిచిన శుద్ధియగును.

మైలుతుత్తశుద్ధి— దీనికిసమముగా వెలిగారమును జేర్చి నీళ్లుగాని, లేక, తేనెనుగాని, పోసిమర్దించి, బిళ్ళచేసి ప్రమిదెలో బెట్టి యింకొకప్రమిదెను పైనమూసి. చీలమన్నుపూసి యెండించి లఘుపుటమును వేసిన పరిశుద్ధమగును.

కఫరిశుద్ధి—దీనినినూరి పొడిచేసి మడతబట్టలో మూటగట్టి, ఆవుపంచితముతో ౨ జాములును, నరమూత్రముతో ౭ జాములును డోలాయంత్రమునం దుడికించినను, లేక, ఆవునేతిలో కలిపి యుడికించినను శుద్ధియగును.

సజ్జక్షారశుద్ధి— దీనిని ఆవుపంచితములోగాని కలితోగాని రెండుగడియల సేపు మర్దించిన శుద్ధియగును.

యవక్షారశుద్ధి—దీనిని పసికడుగుతో మర్దించి యెండలో బెట్టిన శుద్ధియగును.

పంచలవణములశుద్ధులు—సైంధవలవణమును కలితోను, సౌవర్చలవణమును నిమ్మపండ్లరసముతోను, బిడాలవణమును పులిచల్లతోను, కాచలవణమును చింతాకురసముతోను, ఊరబెట్టి యెండలో నెండించిన పరిశుద్ధములగును, సముద్రలవణమును మూకుట్లో పోసి మూడుజాములు వేయించిన శుద్ధియగును.

సొంటి పిప్పలి మిరియాలశుద్ధి—సొంటిని బెరడువొలిచి క్రొత్తసున్నమును పట్టించి, జామునేపు ఎండలో నెండించినను, పిప్పళ్ళను చిత్రమూలరసముతో నూరబెట్టి యెండ నెండించినను, మిరియాలను పులిచల్లలో నూరబెట్టి మూకుటిలో బోసి వేయించినను శుద్ధములగును.

గజపిప్పళ్ళశుద్ధి—దీనినికలితో జామునేపు ఊరబెట్టి యెండలో బెట్టిన శుద్ధియగును

కల్లుకుందుశుద్ధి—దీనినిబలరక్కసి ఆకులో బెట్టి మూటగట్టి ఆవుపాలలో డోలాయంత్రముచే నొకజాము ఉడికించిన శుద్ధియగును.

ఇంగువశుద్ధి— దీనిని తామరాకురసముతో ఎండలోనొకజాము ఊరబెట్టిన శుద్ధియగును.

జీలకఱ్ఱశుద్ధి— నల్లజీలకఱ్ఱను, జీలకఱ్ఱనుకలితో ఎండలో రెండుజాములసే పునిచిపిదప కొంచెము వెచ్చచేసిన శుద్ధములగును.

ఆముదపువిత్తులు, నేలదంతివిత్తులు వీనిశుద్ధి—ఈవిత్తులపై పొట్టునువొలిచిజాము సేపు కెంకాయనీళ్లతోనుడికించిన శుద్ధములగును.

నేపాళములశుద్ధి—వీనిపైపొట్టును, లోపలియగరులనుతీసి పారవైచి, ఆవుపాలతోను, బెల్లపునీళ్లతోను, కలుబందరసముతోను ప్రత్యేకముగ డోలా యంత్రమున నుడికించినశుద్ధియగును.

విషముష్టివిత్తులశుద్ధి— వీనిని తునకలుగ కత్తిరించి చిఱ్ఱివేళ్లరసముతో వండిన శుద్ధియగును.

నాభిశుద్ధి—నాభిని తునకలుగజేసి గుడ్డనమూటగట్టి, ఒకకుండలోవేసి యందు ఆమూటమునుగునటుల ఆవుపంచితముపోసి మూడుదినము లెండలోనునిచి నాలవది నమునదీసి యెండించినశుద్ధియగును. గోమూత్రమును ప్రతిదినము క్రొత్తదిగాపోయు చుండవలయు.

కంకుష్ఠశుద్ధి—దీనిని సొంటిరసముతో 3 సార్లు ఊరబెట్టినశుద్ధియగును, ఇది హేమదారుసింగుఅనిచెప్పబడును.

---

## భస్మాదులుచేసెడిక్రమము.

స్వర్ణశుద్ధి— బంగారు మీద ఎఱ్ఱమన్నుపూసి కొలిమిలోబెట్టి యూదిననది శుద్ధమగును.

స్వర్ణమారణము—బంగారమును సన్ననితునకలుచేసి శుద్ధిచేసి దానికి సరి పాలు సీసభస్మమును నిమ్మపులుసుచేమర్దించి బంగారుకుపూసి, దానిని ప్రమిదెలో నునిచి చీలమన్ను ఇచ్చియెండించి మూడుగజపుటములువేసిన, బాగుగభస్మంబగును.

స్వర్ణసిందూరము—స్వర్ణభస్మమును జిల్లేడు పాలు, రావిచెక్కలరసము వీని తోమర్దించి; ఆభస్మమునకు సరిపాలు, శుద్ధమొనర్చిన ఇంగిలీకమునుకూడజేర్చి దు రదగొండి- హంసపాదియాకు వీనిరసముచే నొకదినముమర్దించిఅయిదుగజపుటము లువేసిన, సిందూరించును.

స్వర్ణభస్మగుణము— కటుకరోహిణి చూర్ణము, నేయి వీనిలో రెండుగురిగింజలయెత్తు భస్మముకలిపి పుచ్చుకొనిన, క్షయము, అగ్నిమాంద్యము, శ్వాసము, పాండువు అరుచిమొదలగు రోగములును విషదోషములును మానును- బలము- కాంతి ధాతువృద్ధికలుగును.

రజతశుద్ధి—వెండినితునకలుగకత్తిరించి గొట్టుకాకరగడ్డరసముతో నేడుమార్లు కడిగినశుద్ధియగును.

రజతభస్మము—హేమమాక్షికము, ఇంగిలీకము వీనిని నిమ్మపండురసముచే మర్దించి, దీనినివెండితునకలపైనపూసి యెండించి ౨ - ౩ గజపుటములువేసిన వెండి భస్మమగును.

రజతసిందూరము—పూర్వోక్తరజతభస్మమునకు సమాంశముగ ఇంగిలీకమును జేర్చి- మర్రిపాలు- జిల్లేడుపాలు- దురదగొండివేళ్ళరసము-హంసపాదియాకురసము తుమ్మపట్టకషాయము వీనిచే ప్రత్యేకముగ నాల్గేసిదినము మర్దనచేసి ౭ గజపుటములువేసిన, సిందూరించును.

రజతభస్మగుణము—దీనిలో తామ్రమును అభ్రకమునుకలిపి అన్నిటికి సమానముగ సొంటి పిప్పలి మిరియాలపొడిని నేతినికలిపి పుచ్చుకొనిన, శ్వాస కాసములు, పాండువు- క్షయము- మూలవ్యాధి- నేత్రరోగము పైత్యరోగము ఇవిమానును.

తామ్రశుద్ధి—రాగినాణ్యములనుగాని- రాగిరేకుచెంబులనుగాని సన్నగ కత్తిరించి- అవుపంచితములో వేసి తీక్ష్ణాగ్నిచే జాముసేపుకాచిన శుద్ధమగును-లేక- రాగిరేకులను ఏడుసార్లుకాచి- కలుబందరసముతోను- పొన్నగంటిరసముతోను ఏడేసిమార్లు కడిగిన శుద్ధియగును.

తామ్రభస్మము—శుద్ధిజేసినతామ్రమునకు సమానముగ- రసమునుగంధకమును జేర్చి జిల్లేడుపాలతో మర్దించి రాగిరేకులకు పూసి యొక గజపుటమువేసినవి భస్మంబగును- దానిని పంచామృతముతో మర్దించి మూడుపుటములువేసిన సకలదోషములుమానును.

తామ్రసిందూరము—మేకపాలు- జిల్లేడుపాలు- మర్రిపాలు- హంసపాదిఆకు- దూలగొండివేళ్లు- వీనిరసములు- రావిచెక్క- జువ్విపట్ట వీనికషాయము వీనిలో ప్రత్యేకముగ నాల్గేసిదానిచేమర్దించి యేడేసిగజపుటములువేసినసెగ్రగసిందూరించును.

గుణము—తామ్రమును అనుపానవిశేషములతో పుచ్చుకొనిన- వాంతి భ్రాంతులను-జ్వరము- కుష్ఠువు- పాండువు- శూల- అగ్నిమాంద్యము- మేహరోగము మొదలగునవియు మానును.

కాంస్యశుద్ధి—దీనినికాచి- చింతాకురసములోను, ఉలవకట్టులోను మూడేసిమార్లుకడిగిన శుద్ధమగును— (కాంస్యమనగా-కంచు.)

కాంస్యభస్మము—కంచును సన్నగకత్తిరించి దీనికి తుల్యముగ గంధకమును చేర్చి జిల్లేడుపాలతోనూరి రేకులకుపట్టించి యెండించి మూసలోనునిచిపిడకలతో భూపుటమువేయవలయు- ఇట్లేడుమార్లు పుటమువేసిన భస్మంబగును.

కాంస్యసిందూరము— కంచుభస్మమునకు అరపాలు ఇంగిలీకము- దానికరపాలు గంధకము దానికిసగము పాదరసము ఇట్లువీనినిజేర్చి- నిమ్మపండురసము - హంస

పాదిఆకురసము- మఱ్ఱిపాలు-రావిచెక్క- తుమ్మపట్ట వీనికషాయము- మోదుగుచెక్కరసము- దూలగొండివేళ్ల రసము వీనిలోనొక్కొకదానిచే ప్రత్యేకముగ మర్దించి- ప్రతిరసముతోనొక గజపుటమువంతున నేడుపుటములు వేసినను-లేక- రసములతో మర్దనచేసి- కొలిమిలోబెట్టియూదినను నైరగసిందూరించును.

కంచుభస్మగుణము — ఇది వగరుగను- ఉష్ణముగను- లఘువుగనునుండును-కఫపైత్యవ్యాధులను హరించును. ఆయుర్బలములన్నొసంగును.

ఇత్తడిభస్మము — ఇత్తడినికంచువలెనేజేసి పుటమువేసిన భస్మమగును— ఇది, కారముగను తీక్ష్ణముగనునుండును- విరేచనమును చేయించును - గుల్మము-మేహము- పాండువు- క్రిములు- వాతములు వీనినిబోగొట్టును.

కాంతశుద్ధి — కాంతమును నిమ్మపండుపులుసు- కలి- పులిమజ్జిగవీనిలోప్రత్యేకముగ నొక్కొకసారివేసి యేడేసిగడియలు ఎండలోబెట్టిన శుద్ధమగును- (కాంతమనగా సూదంటురాయి.)

కాంతభస్మము — శుద్ధిచేయబడిన కాంతమునకు చతుర్థాంశము గంధకమును జిల్లేడుపాలు- మోదుగచెక్కరసము కొండపిండివేళ్లరసము ఈ మూడింటిచేతను ప్రత్యేకముగమర్దించి ఆకాంతమునకుబట్టించి 3 గజపుటములువేసిన భస్మమగును.

కాంతసిందూరము — కాంతభస్మము-దానికిఅరపాలు హింగిలీకము వీనినిజేర్చి దురదగొండివేళ్లరసమున మూడుదినములుమర్దించి యొగ్రమన్నుతోజేసిన వజ్రమూసలోబెట్టి 3 చీలమన్నులుమెత్తి 3 గజపుటములువేసిన కాంతము సిందూరించును.

కాంతభస్మగుణము — ఇది- దీర్ఘాయుష్యమును- దేహమునకు కాంతిని ఇచ్చును. కుష్టువు- ప్రమేహము- శూల-మూలము-గుల్మము- క్షయము, పాండువు - ఉదరరోగము మొదలగువానిని హరింపజేయును.

లోహశుద్ధి — ఉక్కుపొడిని నూనెలో వేసియుడికించి తరువాతనూనెవిడుచునట్లు కడిగి పిదప తుమ్మచెక్కలరసములో వండి యొకజాముసేపు ఎండలోబెట్టిన లోహముశుద్ధియగును.

లోహభస్మము — లోహపుపొడిని చక్కగనూరి నేరేడుచెక్క రసముతో- ఆ కదినము ఉడికించి తిరిగిమర్దించి తరువాత చింతాకురసము- ఉసిరికరసము - మునగపట్టరసము- ఆవుపంచితము వీనిచేప్రత్యేకముగనుడికించి మర్దించి మూసలోబెట్టి-చీలమన్నుపూసి గజపుటమువేసిన భస్మంబగును.

లోహసిందూరము — లోహభస్మమును కరకతాడియుసిరికలరసము- జిల్లేడుపాలు- మఱ్ఱిపాలు వీనిచే నేడుదినములుమర్దించి గజపుటమువేయవలయు- ఈప్రకారముమర్దించుచు- ఏడుగజపుటములువేసిన సిందూరించును-

గుణము — లోహభస్మము ఆయుష్యమును బలమును- వీర్యమును- ఇచ్చును. పాండువు- మేహము- కుష్టువు- ఆమవాతము మొదలగువానినిబోగొట్టును.

కిట్టశుద్ధి — చిట్టెమునుతానికట్టెలనిప్పులోవేసి తిత్తిచే ఊది యెఱ్ఱగ కాచిన

తరువాత-తాటిబొట్లలో అప్పుపంచితమును పోసి అందాచిట్టెము నేడుమార్లు చల్లార్చిన స-
నదిచిల్లిపోయి శుద్ధంబగును.

కిట్టమండూరము—చిట్టెమును అప్పుపంచితమునందును కరకతాడి యుసిరికల
కషాయమునందును వేసి- సరిగురువరకు మెల్లగవండి- యిదపదానిని గోమూత్రముతోను-
కరకతాడియుసిరికల కషాయముతోను ౨౦ సార్లుబ్బి యేబది సార్లుపుటము వేసిన మం
డూరమగును.

మండూరగుణము—మండూరము- ఉష్ణముగను కారముగనునుండును- క్రిము
లు- క్షయము- పాండువు వాపు పురాణజ్వరము మొదలగు రోగములనుమాన్పును.

ఇనుపభస్మగుణము—ఇనుముభస్మము - నేత్రములకు హితమునుచేయును-కట్టు
వు- ప్రమేహము- కామిల- గుల్మము - పాండువు మొదలగురోగముల మాన్పును.

పరీక్ష—భస్మములనుగాని- సిందూరమునుగాని- అగ్నిబాదవేసి పొగలేవకుం
డుట- వన్నెమారకుండుట- వాసన- ధ్వనిలేకుండుట- నీళ్ళలోవేసిన తేలుట ఇట్టిలక్ష
ణములుగలిగియుండిన నిర్దుష్టములని చెలియుంగునది.

సీసశుద్ధి—వావిలిపెళ్ళచూర్ణమును జిల్లేడుపాలతో నూరి సీసపురేకులకుపట్టించి
యెండించి తరువాత ఆసీసమునుకరిగించి వావిలి ఆకురసములో వేయవలయు ఇట్లే
డుమార్లొనర్చిన సీసముశుద్ధమగును,

సీసభస్మము— సీసమునుమూకుటిలోబోసి అందులో అడ్డసరపాకురసము- ఓ
మపురసము వీనినిపోసి అడ్డసరపుపుల్లతో వేయించుచుండిన సీసము భస్మమగును.

రససిందూరము—అడ్డసరము - బోడతరపాకు- ఓమము- వీనిరసములతో సీస
భస్మమును అనేకపర్యాయములు మర్దించి ప్రమిదెలోబెట్టి చీలమన్నుపూసి- పదిగజ
పుటములనువేయవలయు. తరువాత తమలపాకులరసముతో పదిమార్లుమర్దించి పది
గజపుటములువేసిన సీసము సిందూరించును.

సీసభస్మగుణము—ఇది- దేహమునకు మంచిబలమును ఆయుర్వృద్ధిని- కాంతిని
వీర్యవృద్ధిని కలుగజేయును- సమస్తరోగముల హరింపజేయును.

వంగశుద్ధి—జిల్లేడు- కానుగ- ఉమ్మెత్త- ప్రత్తిఆకు- బొంతజెముడు - చిత్ర
మూలము- నల్లేరు- పెన్నేరు వీనివ్రేళ్ళను ఆకులను కాయలను తెచ్చి మజ్జిగపోసి తొ
క్కి- రసముతీసి మజ్జిగకలిపి వడియగట్టి అందులో తగరమును కరిగించి పోయవలయు
ఇట్లయిదుదినములు కరిగించుచు పోయుచుండిన శుద్ధమగును.

వంగభస్మము— శుద్ధతగరమును మూకుటిలో వేసి కరగించి దానిమీద ఉత్త
రేణుచూర్ణమునువేసి కలియబెట్టుచుండిన తగరముభస్మమగును- లేక - తగరముపైన
కఫరినినూరిపట్టించి నిప్పులోకాచినను భస్మమగును.

వంగసిందూరము—పైభస్మమును నిమ్మపండుపులుసుతో మర్దించి 3 గజపు
టములువేసిన సిందూరమగును.

వంగభస్మగుణము— ఇదిచేదుగ- ఉష్ణగనుండును- క్రిమిరోగము- పాండువు-

వాతములు మేహవ్రణములు- మొదలగువానినిపూన్చును-కొంచెముపిత్తమునుజేయును.

అభ్రకపరీక్ష—అభ్రకమును నిప్పులో వేసియూదినయెడ రూపము మారకుండినది కృష్ణాభ్రకమని యెఱుంగునది - ఇట్టిదానినే ఔషధములయందు జేర్చికొనవలయు.

అభ్రకశుద్ధి—కృష్ణాభ్రకమును మూకుటిలోవేసి కొలిమిలోనునిచి యెఱ్ఱగవగువఱకు ఊదిపాలనుచల్లి చల్లార్చి రేకులుగవ్వాలిచి - చింతాకు- చిత్రిఆకు- తెప్పతీగెఆకు వీనిరసములలో నొకదినమంతయు నూరబెట్టిన శుద్ధమగును.

ధాన్యాభ్రకవిధి—శుద్ధిచేసిన కృష్ణాభ్రకమును కలితోనుమర్దించి ముద్దచేసి- కుండకువాసెనగట్టి దానిమీద అముద్దనునిచి దానిమీద- రెండుపాళ్లు వడ్లను- కలిని పోసి బాగుగరుద్దిన- అభ్రకము చూర్ణమై కుండకడుగున జేరును - పిదపఆచూర్ణమును దీసియెండించవలయు- దీనిపేరు ధాన్యాభ్రకము.

అభ్రకభస్మము— ధాన్యాభ్రకమును జిల్లేడుపాలచేనైనను, జిల్లేడువేళ్ళ రసముచేనైనను నూరి బిళ్ళచేసి ఒకగజపుటము వేయవలయు - ఇట్లు ౬ పుటములు వేసినని ర్దుష్టంబైనభస్మంబగును.

మఱియొక్కవిధము— పొన్నగంటి- కలుబంద- గలిజేరు- వాకుడు- తులసి-గొలిమిడివేళ్లు- తెల్లచాగ- వీనిరసములచే వెవ్వేరుగమర్దించి ధాన్యాభ్రకమును వడియములుచేసి ఎండనెండించి మూకుడులోబెట్టిమూసిచీలమన్నుపూసి-పైజెప్పినరసములలో ఒక్కొక్కరసమున కొక్కొక్కపుటమువంతున ఏడుగజపుటములువేసితీసి తరువాత దానిని పంచామృతముతో మర్దించుచు ఏడుగజపుటములు వేసిననిశ్చంద్రికముగభస్మంబగును.

అభ్రకసింధూరము—ధాన్యాభ్రకమును తుంగముస్తెలకషాయముతో మర్దించి ౨౧ పుటములును- అపుపంచితము- కరకతాడి ఉసిరికలకషాయము వీనిచేమర్దించి ౨౧ పుటములును- కసివెందాకురసముతో మర్దించి ౨౧ పుటములును, పాలతోమర్దనచేసి మూడుపుటములునువేసి తరువాతమఱల మర్దించి వడియములుచేసి యెండనెండించిజిల్లేడాకులలోబెట్టికట్టి మూకుటిలోనునిచి కెంపునగునవఱకుగజపుటములువేసిన-నిశ్చంద్రకముగసింధూరించును.

అభ్రకభస్మగుణము—ఇది- ముదిమినివృత్త్యవును సకలరోగములనుబోగొట్టును. శరీరమునకు దృఢశక్తిని- వీర్యమును-కాంతినిఇచ్చును.

రసభస్మము— ఉత్తరేణివిత్తులనుతెచ్చి నూరి రెండుమూసలుగజేసి- ఒకదానిలోతుమ్మిపూలు- వాయువిళంగములు- నల్లతుమ్మ- ట్రి వీనిచూర్ణమునువేసి- శుద్ధిచేయబడినరసమును జిల్లేడుపాలచేమర్దనచేసి దానిని అమూసలోనిచూర్ణముపైనవేసి దానిమీదతుమ్మిపూలు మొదలైనవాని చూర్ణమునువేసి రెండవమూసనుమూసి సంధులకుచీలమన్నుపట్టించి- ఇంకొకమట్టిమూసలోనునిచి- దానిమీద మఱియొకమట్టిమూసనుమూసిసంధులకుచీలమన్నుపట్టించిఎండినతరువాతగజపుటమువేసినరసముభస్మమగును.

రససింధూరము— శుద్ధిచేసినరసము- గంధకము- వీనినిసరిపాళ్లుగగూర్చి కల్వ

మున జాము సేపు మర్దించి- మణిత్రిఫాడల రసములో మూడుసార్లూరబెట్టి తరువాత గాజుకుప్పెలోవేసి- ఆకుప్పెకు చీలమన్నును ఏడుమార్లు పట్టించి ఎండించి- తరువాత ఒకకుండలో మూడంగుళముల ఎత్తుగ ఇసుకనుపోసి దానిమీదఆకుప్పెనునిచి కుప్పెగొంతువరకు మరల ఇసుకనుపోసి- నాలుగుజాములుక్రమముగ మెల్లమంటచేత వండి మరునాడు చల్లారనిచ్చి తీసి కుప్పెనుపగలగొట్టి అందు ఉదయకాలపుసూర్యుని వంటికాంతిగల రససిందూరమునుగ్రహించవలయు.

రసభస్మగుణము—జాజికాయ ౧తు. జాపత్రి౧తు-లవంగములు ౧తు-పిప్పలి ౧తు- వాయువిళంగాలు ౧తు- ఓమము ౧తు- బెల్లము ౭ తు- వీనినిమర్దించి చూర్ణముచేసి-వస్త్రగాలితముచేసి ఆచూర్ణములో ౪ తులము రసభస్మమునుగలిపి అర్ధనేతితోబుచ్చుకొని చప్పిడిపథ్యముగనుండిఅర్ధమజ్జిగన్నపుచ్చుకొనుచుండిన సకలరోగములుమానును

రససిందూరగుణము— దీనిని తేనెతోగాని- పిప్పలిపొడితోగాని పుచ్చుకొనిన- సర్వరోగములుమానును మరియు- అగ్నిమాంద్యము- క్షయము-పాండువు- గుల్మము- ప్రమేహము- మూలవ్యాధి- జ్వరము - వాంతి మొదలగునవిమానును. ఈ రససిందూరమును క్రమముగననుభవించిన పురుషునికి - రతికాలంబున స్త్రీలయొక్కమదము నణగించునట్టి వీర్యశక్తిగలుగును.

## నవరత్నాదులశుద్ధులు—తద్భస్మములు.

కెంపులశుద్ధి— వీనినిగుర్రపుమూత్రమున ౩ దినములుమంచి కుండలోబెట్టి-వేడిసీళ్ళతోగడిగిన శుద్ధములగును. భస్మము—కెంపులను జిల్లేడుపాలతో ౩ దినములూరబెట్టిమూకుడులోనునిచిచుట్టుచీలమన్నుపట్టించి ౩పుటములువేసిన భస్మమగును— ఇది శీతలముగ- మధురముగనుండును- అగ్నిదీపనమునుజేయును- ఆయుష్యమును-కాంతిని ఇచ్చును- వీర్యమును వృద్ధిపరచును- గ్రహపీడలనుబోగొట్టును.

ముత్యములశుద్ధి— వీనినితెల్లఉప్పిపండ్లరసములోనైనను-చింతపండుపులుసుతోనైనను మూడుదినములునానవేసిన శుద్ధియగును- భస్మము— శుద్ధిచేయబడిన ముత్యములను తెల్లములకపండ్లరసములో నానవేసి మూకుళ్ళలోనునిచిచీలమన్నుపట్టించి భూపుటమునువేసిన- భస్మమగును- ఇదిశీతలముగనుండును-అగ్నిదీపనమునుచేయును- స్వరభంగమును వస్తిశూలనుమాన్పును.

వజ్రశుద్ధి—వజ్రములను నిమ్మపండులోనునిచి- వావిలిఆకు - ఎలుకచెవియాకు- ప్రబ్బలి - జమ్మి-తెగడ - చిత్రి - భ్రమంగ - కర్కాటకశృంగి - ఉలవలు - అళ్లు వీనికషాయములుపోసి ౩ దినములు డోలాయంత్రమున వండిన వజ్రము శుద్ధియగును. భస్మము—ఈవజ్రములను నల్లేరురసములో నొకదినము నాననిచ్చి పిదపవజ్రమూసలోనునిచి చీలమన్ను పట్టించి యేరుపిడకలతోగజపుటమువేసిన భస్మమగును — ఇదిసకలరోగములనుమాన్పును. ఆయువు- బలము-కాంతినీనినిచ్చును.

వైక్రాంతశుద్ధి— వైక్రాంతపురాళ్ళను వజ్రములవలెశుద్ధి చేయవలయు. లేక - ఈరాళ్ళను ఇరువదియొకసార్లు - ఎఱ్ఱగకాచి - గుర్రపుమూత్రములో ౨౧ సార్లు

తీసి చల్లార్చిన శుద్ధములగును. భస్మము — దుష్టుపు బెట్టును సమూలముగ దెచ్చి నూరి ముద్దచేసి దానిలో - ఆ వైక్రాంతపు రాళ్ళనుంచి - మూసలోబెట్టి మరియొక మూసను మూసి చీలమన్నుపట్టించి గజపుటము వేయవలయు - ఇట్లేడుసార్లు గజపుటములు వేసిన వైక్రాంతములు భస్మమగును. ఇది ఆయుర్వృద్ధిని, అగ్నిదీపనమును జేయును. త్రిదోష- విషదోషములను, సకలరోగములను మాన్పును.

వైడూర్యశుద్ధి— వైడూర్యమును అశ్వమూత్రమున నొక దినంబును, గుమ్మడిపండు రసమున నొకదినంబును నానబెట్టిన శుద్ధియగును. భస్మము—శుద్ధిచేయబడిన వైడూర్యమును కొండపిండి వేళ్లరసమున నానబెట్టి- తరువాత కొలిమిలో నునిచి యూది వజ్రమూసలోనునిచి చీలమన్ను పట్టించి గజపుటము వేసిన-వైడూర్యము భస్మమగును- ఇది వజ్రముయొక్క గుణము గలిగియుండును.

నీలశుద్ధి—నీలములను గాడిదెమూత్రమునందు వేసి - మంచిగుండలో నొకదినము కాచిన శుద్ధియగును- భస్మము—ఆనీలములను అతిపంజాకురసమున ౮ జాములు నాననిచ్చి తరువాత మూసలోనునిచి- కొలిమిననూదిన భస్మమగును. ఇది శీతలముగను- మధురముగనునుండును. పైత్యమును బోగొట్టును.

గోమేధికశుద్ధి— దీనిని అశ్వమూత్రమున మూడుదినములు నాననిచ్చి యటుపిమ్మట నేలగుమ్ముడుగడ్డరసమునందు నానబెట్టిన శుద్ధిజెందును. భస్మము—దానిని నల్లయుమ్మెత్తాకురసమున మూడుదినములు నానబెట్టి తీసి మూసలోనునిచి కొలిమిననూదిన భస్మమగును. గోమేధికభస్మము అగ్నిదీపనమును చేయును- కఫమును హరించును - బలమునిచ్చును.

ప్రవాళశుద్ధి— పగడములను నిమ్మపండుపులుసున జాముసేపు - నాననిచ్చి వేడినీళ్ళ గడిగిన శుద్ధిజెందును- భస్మము— ఆపగడములను జిల్లెడుపాలయందు 3 దినములు నాననిచ్చి పిదప మూకుడులో బోసి మూసి చీలమన్ను పూసి గజపుటము వేసిన - భస్మమగును- ఇది రక్తపిత్తము- నెత్తురుభేదులు - కుసుమరోగము రక్తశూలలు పైత్యము వీనిని మాన్పును.

పుష్యరాగశుద్ధి— దీనిని మేకమూత్రమున జాముసేపునిచిన శుద్ధియగును. భస్మము—ఆపుష్యరాగములను కొండపిండి వేళ్లరసమున నానబెట్టి- మూకుడులో నునిచి చీలమన్నుపూసి కొలిమిననూదిన భస్మమగును- ఇది పుష్టినిచ్చును. కఫమును శైత్యమును జేయును.

మరకతశుద్ధి— నేలగుమ్ముడుగడ్డను తొలిచి అందులో పచ్చరాళ్లనునిచి - ఆగడ్డ మూతికి చీలమన్నుపూసి జానెడుచదరము, జానెడులోతుగల పల్లమునందు పుటము వేసిన శుద్ధిజెందును. భస్మము— ఆపచ్చలను- వాకుడురసమున నానబెట్టి కొండపిండి వేళ్లరసముతో మర్దనచేసి బిళ్ల చేసి యెండబెట్టి మూకుడులోనునిచి మూసి చీలమన్ను పట్టించి గజపుటము వేసిన భస్మమగును—ఈభస్మము త్రిదోషములహరించును- విషహారముగను లఘువుగనునుండును.